Photo by D. I. Chanthamian



బహుమతి
పొందిన వ్యాఖ్య

మీనుల పంట

పంపినవారు :
డి. అజంతాదేవి - చిత్తూరు

అంతర్జాతీయ చలనచిత్ర మహోత్సవంలో దక్షిణభారత చలనచిత్ర నిర్మాణానికి మణిపూసగా ఎన్నుకొనబడిన అసమాన చిత్రం. 30 థియేటర్లలో శతదినోత్సవాలూ, 3 థియేటర్లలో రజతోత్సవాలూ చేసుకొన్న మేటి చిత్రం.

విజయ వారి...

# పాతాళ భైరవి

నిర్వాహకులు - నాగిరెడ్డి ... చక్రపాణి.... డైరెక్టర్ - K.V.రెడ్డి, B.Sc(Hons)

అపూర్వ కథా కల్పన ! నేత్రపర్వమైన ఛాయాగ్రహణం, కళా శిల్ప సంపద ! వీనులవిందైన శబ్దగ్రహణం, గానసుధ ! అద్భుతమైన హాస్యం ! సర్వాంగ సుందరమైన చిత్రం ఇది ఒకటే !

చిత్రాన్ని మరల చూసి ఆనందించండి




చమ్రియా రిలీజు

# చందమామ

సంచాలకుడు:
'చక్రపాణి'

వచ్చేనెలనుండి చందమామ కొత్త సంపుటి ప్రారంభం కాబోతున్నది. కొత్త సంపుటి అనగానే పత్రిక రూపురేఖల లోనూ, లోని విషయాలలోనూ మార్పులకోసం పాఠకులు ఎదురుచూస్తూనే వుంటారని మాకు తెలుసు. ఇందు కోసమే మేమూ యత్నిస్తున్నాము. ఈ సంచిక చివరి పేజీలలో టైప్‌రైటింగ్ చిత్రమొకటి ప్రకటితమైంది. ముచ్చటైన ఈ బొమ్మ X అనే ఒక్క అక్షరంతో తయారై వుండటం పాఠకులు గమనించగలరు. ఇది ఒక ప్రత్యేక కళాశాఖ. ఇందులో అభిరుచి గల మా పాఠకులు కృషిచేసి, ఇటువంటి చిత్రాలు మరెన్నో పంపుతారని ఆశిస్తున్నాము. ఈ సంచికలోనే 11 ఏళ్ల ఉదయశంకర్ వేసిన చక్కటి రేఖాచిత్రంకూడా చందమామ ఆదరాన్ని అందుకొన్నది. ఇలా ప్రత్యేకించి ఏ కళాశాఖకు చెందిన చిత్రాలైనాసరే కృషిచేసి పంపితే, పాఠకులకు ప్రోత్సాహమీయటంలో చందమామ ఎల్లప్పుడూ ముందంజ వేయటానికి సిద్ధంగానే వుంటుంది. ఈ తరుణాన్ని చందమామ చదువరులు వినియోగించుకొంటారని నమ్ముతాం.

సంపుటి 12 :: జూన్ 1953 :: సంచిక 6

SANKAR...

# మొక్క నాటిన ముదుసలి




ముగ్గురు బాలురు బాటను వస్తున్నారు.
వస్తూ వారలు వింత ఒకటి కన్నారు.
ఒక్క ముసలివాడొకడు బాటకొకప్రక్క,
కూర్చుని చక్క నాటుతున్నాడొక మొక్క.

'నేడో రేపో నేలను రాలే పండూ,
ఎందు కీతనికి ఈ దండుగపని మెండూ.'
అని బాలురు తమ మదిలో ననుకొన్నారు.
అనుకొని ఆ ముదుసలివద్దకు చన్నారు.



'తాతా! తాతా! మొక్క నాటతావెందుకు?
ఉండవు ఇంకెన్నాళ్లో, శ్రమ నీకెందుకు?
'రామా, కృష్ణా' అంటూ గడపక కాలం,
ఎందుకొచ్చినది నీకిక ఈ బంబాలం?

మేము ఆశపడినా ఉంటుందొక అర్థం.
మేము కష్టపడినా కాదంతట వ్యర్థం.
నీకెందుకు శ్రమ?' అని వారనగా ముదుసలి
అన్నా 'డబ్బాయిలూ, వింత ఇది మిక్కిలి.

ఎవరూ శ్రమపడకుండా ఎట్లాగయ్యా!
మొక్క నాటకుండా పళ్లెట్లాగయ్యా!
'మన శ్రమఫల మెవ్వరో అనుభవిస్తారు'
అని విజ్ఞులు మది ఎందుకు చింతిస్తారు?





నా నాటిన మొక్కే దిగి నీడలే చాస్తే
మూడు పూవులై, ఆరు కాయలై కాస్తే
నా పిల్లలు నా పిల్లల పిల్లలుగానీ,
సుఖపడితే చాలదా ఒక్కరవ్వేనీ?

వారీ చెట్టుల పళ్ళు త్రుంచుకొంటారు.
అరగించి తాతయ్య నెంచుకొంటారు.
అంతకన్న నాకిక వలసిన దేముందీ?
ఈ అదృష్టం ఎంతమంది కుంటుందీ?

ఇక కాలం అంటావా? ఎవరికి ఎరుక?
ఎవ్వరికుందో ఆయుస్సెంతటివరకు?
పడుచువారమని మిడిసిపడేవారైనా
పిలుపొస్తే వెళ్ళకతప్పదు ఎవరైనా?

రచన:
"బైరాగి"

అనగా బాలురు వెళ్ళిపోయిరటనుండీ.
కడకు ముసలిమాటలు నిజమయినాయండీ.
ముగ్గురిలో ఒక్కడు అనిలో చచ్చాడు.
నీటగండమై చచ్చెను రెండవవాడు.

మూడవబాలుడు చెట్టు ఎక్కి పడి చచ్చీ,
ముదుసలిమాటలు నిజమైనవి ఎటువచ్చీ.
ముసలివాని సంతతివారందరుకూడ,
చెట్టువల్ల సుఖపడ్డా రెంతో నీడ.



# అట్టివీదిబొమ్మ

వీరాధివీరుడైన ద్రుపదుణ్ణి అర్జునుడు పట్టితెచ్చి, ద్రోణాచార్యునికి గురుదక్షిణగా సమర్పించాడని తెలుసుకొన్నాముకద!

అర్జునుడి పరాక్రమాన్ని గురువర్యుడు మెచ్చుకోవటం సహజమే. కాని, విడ్డూరమేమిటంటే, అర్జునునివల్ల ఓటమిపొంది, పరాభవింపబడిన ద్రుపదుడే అతనిని ఎంతగానో మెచ్చుకొన్నాడు!

పైగా, ద్రుపదరాజు ద్రోణునిపైన పగబూనాడు. 'ద్రోణుని చంపగల కుమారుణ్ణీ, అర్జునుని వరించటానికి తగిన కూతురునీ కన్నతరువాతగాని మళ్లీ రాజ్యం చేకొనను' అని ప్రతిజ్ఞపట్టాడు.

గంగాతీరాన వున్న ఋషులకు తన ప్రతిజ్ఞ వెల్లడించగానే, వారు 'పుత్ర కామేష్టియాగం' చేయుమని సలహా ఇచ్చారు. ఆప్రకారం యాగానికి అవసరమైన పరికరాలన్నీ సమకూర్చుకొని, వేదోక్తవిధిగా క్రతువు జరిపించాడు ద్రుపదుడు.

యాగమంతా పరిపూర్తిచేసి, చివరకు, పూర్ణాహుతి సమర్పించే సమయాన, తేజస్వి ఐన కుమారుడు అస్త్రశస్త్రాలతో, కవచకుండలాలతో ఉద్భవించాడు! అప్పుడు అశరీరవాణి "రాజా! వీడే నీవు కోరుకొన్న కుమారుడు ధృష్టద్యుమ్నుడు!" అని పలికింది.

తరువాత స్వయంగా, అగ్నికుండంలోనించి అగ్నిదేవుడే ప్రత్యక్షమై ఎదుట నిలచాడు. అతని చేతులలో ఒక స్త్రీశిశువు ఉన్నది. బంగారు బొమ్మలాగా వుండే ఆ శిశువును అగ్నిదేవుడు ద్రుపదుని చేతికిస్తూ 'నీవు కోరుకొన్నటువంటి కన్య ఈ ద్రౌపదే' అని చెప్పి, అంతర్హితుడయ్యాడు.

ద్రుపదుడు తలపెట్టిన పుత్రకామేష్టియాగం ఇలా దిగ్విజయంగా నెరవేరిన తరువాతనే తిరుగా ఆయన తన పాంచాలరాజ్యం ప్రవేశించాడు. అరణ్యవాసం చేసి వచ్చిన తమ ప్రభువు మళ్లీ వచ్చినందుకు రాజ్యంలో ప్రజలందరూ సంతోషంతో ఉత్సవాలు చేశారు. వరప్రసాదంగా పుట్టిన ధృష్టద్యుమ్నుడూ, ద్రౌపదీ దినదినప్రవర్ధమాన మవుతూ వచ్చారు. ధృష్టద్యుమ్నుడు వీరుడుగానూ, ద్రౌపది రూపసిగానూ పేరు పొందారు.




కాశీనగరాన్ని బ్రహ్మదత్తుడు పరిపాలించే కాలంలో ఒకప్పుడు, బోధిసత్వుడు ఆస్థాన క్రయాధికారిగా ఉంటూవుండేవాడు.

క్రయాధికారి అంటే రాజ్యానికి అవసరమైన వస్తువాహనాలు అన్నీ నాణ్యంచేయటంలోనూ, వాటి విలువకట్టడంలోనూ నేర్పు కలవాడన్నమాట.

బోధిసత్వుడు, కాశీరాజ్యానికి కావలసిన యేనుగులనూ, గుర్రాలనూ, వెండి బంగారాలనూ పరీక్షచేసి, విలువకట్టి, తన అంచనా ప్రకారం, ఆ జంతువులనూ వస్తువులనూ తెచ్చిన యజమానులకు డబ్బు చెల్లించుతూ వుండేవాడు.

ఐతే, కాశీరాజుఐన బ్రహ్మదత్తుడు పరమలోభి కావటంచేత, బోధిసత్వునిగురించి అపోహ ఒకటి కలిగింది : "ఈ క్రయాధికారి ప్రతివస్తువుకూ బోలెడంత ధర పెట్టేస్తున్నాడు. ఇలాఐతే, త్వరలోనే నా రాజ్యం దివాలా తీస్తుందే!" అని అనుకొన్నాడు తన మనసులో.

ఇలా అనుకొని, కిటికితలుపు తెరిచి, ఒకసారి పెరట్లోకి చూచాడు. అక్కడవుండే పరిజనంలో ఒకనిమీద రాజుదృష్టి పడింది. ఇకేముంది ?—ఆలోచనాలేదు, ఏమీలేదు. వాడిని పిలిపించాడు. వెంటనే బోధిసత్వుడి స్థానంలో, ఊరూ పేరూ లేని ఆ అమాయకుణ్ణి నియమించాడు.

ఆ కొత్తవాడు బుద్ధికుశలతవల్ల వస్తువులు క్రయంచేయటంలో యుక్తిచేసి, తనకు లాభసాటిగా వ్యవహరిస్తాడని రాజు ఆశ. ఐతే, ఇప్పుడు కొత్తగా వచ్చిన క్రయాధికారి పట్టి తెలివితక్కువ దద్దమ్మ.

ఈ అధికారికి అసలు వస్తుతత్వంకాని, నాణ్యంకాని, దాని విలువకాని ఎంత మాత్రమూ తెలియదు. అందుచేత, ఏనుగులూ, గుర్రాలూ, వస్తుసామగ్రీ బేరం

ఆదినారాయణ






చేయవలసివస్తే తన బుద్ధికి ఏమితోస్తే అది చెప్పి అడగటమే తప్ప, ఒక సరిఅయిన పద్ధతీ, అంచనా, ఉండేదికాదు. అందువల్ల వస్తువులు తెచ్చే వర్తకులకు తరచు నష్టమే కలుగుతూవుండేది.

నష్టమేకలిగినా, కొనేది రాజుకొలువులోని అధికారి కావటంచేత, మారుమాటాడలేక, ఇచ్చిందేదో పుచ్చుకుని, ఇంటికిపోయేవాళ్లు. వర్తకులు బేరంలో అన్యాయం జరిగిందని కాని, నష్టపడ్డామనిగాని పైకి చెప్పకోవటానికి వీలే లేకపోయేది.

ఒకరోజున ఉత్తరదేశంనించి ఒకానొక అశ్వవర్తకుడు ఐదువందల మేలుజాతి గుర్రాలను తీసుకుని కాశీరాజువద్దకు వచ్చాడు. వెంటనే రాజు తన అస్థాన క్రయాధికారికి కబురంపించి, అ గుర్రాలను నాణ్యంచేసి విలువకట్టమన్నాడు.

క్రయాధకారి వచ్చి, ఐదువందల గుర్రాలనూ పరీక్షించాడు. "దీనికేముంది!— ఒక కుంచెడు బియ్యమిచ్చి అ అసామీని పంపించివేయండి. గుర్రాలను సాలలో కట్టివెయ్యండి" అని తడుముకోకుండా ఉత్తరువులు జారీచేశాడు.

దేవుడా అంటూ అశ్వవర్తకుడు మరలిపోయాడు. ఐతే—అతను, అందరిలాగా ఇంటిదారి పట్టలేదు. తిన్నగా, పూర్వపు క్రయాధికారి అయినటువంటి బోధిసత్వుని వద్దకు వెళ్ళి, తన గోడు వెలపోసుకొని, సలహా చెప్పమని కోరాడు.

అప్పుడు బోధిసత్వుడు సంగతి సందర్భాలన్నీ విని, "అబ్బాయీ!—ఒక పనిచెయ్యి. అధికారిని తృప్తిపరిచేటందుకుగాను ముందుగా అతనికి లంచమియ్యి. తరువాత ఇలా ప్రశ్నించు: 'బాబయ్యా!—నా గుర్రాలకు తమరు కట్టిన విలువ—కుంచెడు బియ్యమూ—చాలా ఖచ్చితంగానే వున్నది. ఐతే, కుంచెడు బియ్యానికి విలువ ఎంతో

అ విషయం తమరు దర్బారులో ప్రభువుల ఎదటనే సెలవిప్పించగలరా!' అని. ఆ క్రయాధికారి ఇందుకు అంగీకరిస్తే, రేపు అతనిని రాజువద్దకు తీసుకపో. అ సమయానికి నేనూ అక్కడికి వచ్చి, తక్కిన సంగతి చూచుకొంటా" అంటూ సలహా చెప్పి పంపాడు.

బోధిసత్వుడు చెప్పినట్లుగా, ఆ అశ్వవర్తకుడు వెంటనే క్రయాధికారి వద్దకు పోయి, రెండవకంటికి తెలియకుండా అతనికి తగినంత లంచమిచ్చి, ప్రశ్నవేశాడు.




క్రయాధికారి సంతోషంలో మునిగిపోయి, "అఁ—దానికేముంది! అదొక పెద్దప్రశ్నా? రాజుకు నేను సమాధానంచెప్పి సద్దిపుచ్చుతాలే" అన్నాడు.

మరునాడు దర్బారు కిటకిటలాడుతూ వుంది. మంత్రిపుంగవులు, ముఖ్యోద్యోగులూ సమావేశమయ్యారు. రాజుకోరికపైన బోధిసత్వుడుకూడా వచ్చాడు.

రాజుయెదట అ అశ్వవర్తకుడు 'ప్రభూ!-నాఐదువందల గుర్రాలకూ ఒకకుంచెడు బియ్యం విలువకట్టడం, చాలా మెచ్చుకోతగిందే. ఐతే, నాకు కలిగిన చిన్నసందేహం ఒకటి వున్నది: అ కుంచెడు బియ్యానికి విలువ ఎంత అని?' అంటూ మనవి చేసుకొన్నాడు.

ఇంతవరకు నడిచిన కథ రాజుకు ఏమీతెలియదు. అందుచేత అమాయకంగా "క్రయాధికారీ!—ఐదువందల గుర్రాల విలువ ఎంత కట్టావు?" అని అడిగాడు.

"కుంచెడు బియ్యమండి ప్రభూ!" అన్నాడు క్రయాధికారి.

"భేష్. బాగా వుంది. ఐదువందల గుర్రాల ఖరీదూ కుంచెడు బియ్యం విలువ ఐతే, ఒక కుంచెడుబియ్యం విలువ ఎంత?" అని మళ్లీ ప్రశ్నవేశాడు. ఈ ప్రశ్నకు అస్థాన క్రయాధికారి ఆలోచన అనే మాట లేకుం



డానే, "కుంచెడు బియ్యంవిలువ యేముంది ప్రభూ!—కాశీరాజ్యమూ, ఇరుగు పొరుగు సామంతరాజ్యాలూ కలిపితే ఎంత విలువ వుంటుందో, అంత విలువ!" అనేశాడు.

విడ్డూరమైన ఈ జవాబు వినటంతోనే, మంత్రులూ, పరివారమూ, దర్బారులోని ప్రముఖులూ అంతా జేజేలుకొట్టి, పొట్టలు చెక్కలయేటట్టు నవ్వటం ప్రారంభించారు. వాళ్ల కోలాహలధ్వనులతో దర్బారంతా ప్రతిధ్వనించింది!

వారంతా క్రయాధికారిని చూచి,—

"రాజ్యాలకు విలువ నిర్ణయించటం అసాధ్యమని అనుకుంటూ వచ్చాము. కాని, కాశీరాజ్యమంతాకలిపి ఒక్క కుంచెడు బియ్యమే ఖరీదుచేస్తుందని ఇప్పుడుకదా తెలిసింది!! ఆహా! ఏమీ తెలివితేటలండీ క్రయాధికారిగారూ! ఆస్థానంలో ఉండ తగిన ఉద్యోగివయ్యా!!" అంటూ గేలి చేయసాగారు.

అప్పుడు బోధిసత్వుడు ముందుకువచ్చి, "ఆ క్రయాధికారి చెప్పినది పరమసత్యం. అందులో విడ్డూరమేమీ లేదు. అతనిని పరిహసించకండి. ఐదువందల గుర్రాలూ ఒక కుంచెడుబియ్యం విలువ అన్నాడు. ఒక కుంచెడుబియ్యం విలువ కాశీ రాజ్యమూ, సామంతరాజ్యాలూ కలిపినంత అని చెప్పాడు. దీన్నిబట్టిచూస్తే ఆ ఐదు వందల గుర్రాల విలువ, కాశీరాజ్యమూ సామంత రాజ్యాలూ కలిపినంత అని తెలుస్తున్నదికద. ఆయన గుర్రాలకు కట్టిన విలువ చాలా న్యాయంగా వున్నది" అని చెప్పాడు.

బోధిసత్వుని మాటలకు అందరూ ఆశ్చర్యపోయారు. తరువాత నిజానిజాలు బయటపడినై. అప్పుడు కాశీరాజు కళ్ళు తెరిచి, పరిస్థితులు గ్రహించి, ఈ క్రయాధి కారిని తొలగించి, మళ్ళీ బోధిసత్వుని మామూలు పదవిలో నియమించాడు.





# శబ్దవేధి

[ గిరికోటఅధిపతి భీమవర్మతండ్రినిచంపి కొడుకును పెంచాడు. యుద్ధానికివెళ్ళి సైనికులకొరకు కబురంపగా వున్నసైన్యమంతా తరలిపోయింది. ఈలోపు ఇక్కడ గుప్తశత్రువులుతలెత్తి అతని బంటునొకనిని బలిగొన్నారు. ముందు చదవండి–]

భీమవర్మా, అతని సైనికులూ, ఆరాత్రి రాంనగర్‌లో హాయిగా నిదురపోయారు. వేకువజామునే లేచి భీమవర్మ తన వ్యవహారాలు చూచుకొనసాగాడు. అతడు చాలా కరుకుమనిషి. నయానో, భయానో, పని నెరవేర్చుకపోవటం అతనికి పరిపాటి.

ఆరోజు ఉదయం విజయవర్మ, సైనికులతో రాంనగర్ చేరుకొనేటప్పటికి భీమవర్మ తన విడిదిలోని ఒక గదిలో కూర్చొని ఉన్నాడు. ఆ గదిలో పన్నెండేళ్లవాడిలా కనపడే ఒక కుర్రవాడుకూడా ఉన్నాడు.

ఇంతలోనే విజయవర్మ గుర్రం దిగి హడావుడిగా ప్రవేశించాడు. భీమవర్మ తలెత్తిచూసి 'విజయా! నువ్వెలా వచ్చావు? రామసింగు ఏమయ్యాడు?' అని అడిగాడు. విజయవర్మ నమస్కరించి, లేఖ తీసిఇచ్చి 'ఇది చదువుకోండి. అంతా మీకే తెలుస్తుంది' అన్నాడు. ఆ లేఖ చదివేసరికల్లా భీమవర్మ ముఖం కోపంతో ఎర్రబారింది. 'ఏదో పాటనుగురించి వ్రాసిఉంది దీనిలో. అది నీవుకూడా చదివావా ?' అని విజయవర్మను అడిగాడు. విజయవర్మ తలఊపాడు.

'దాంట్లో మీ తండ్రిని సోమశర్మ చంపినట్టో ఏదో రాసిఉందటగా ?' అన్నాడు భీమవర్మ. 'నేనే పాపం ఎరుగనన్నాడు సోమశర్మగారు' అని బదులు చెప్పాడు






వర్మ చలిది తినసాగాడు. ఇంతలో అతని చేతినెవరో తాకినట్టనిపించింది. ఒక లేత గొంతుక అతని చెవిలో గుసగుసలాడింది: 'తూరుపుకొండకు త్రోవ చెబుతావా అబ్బాయీ!' అని. 'గిరికోట త్రోవనే వెళ్ళు. ఏటిని చేరుకొంటావు. అక్కడ కనుక్కుంటే తెలుస్తుంది.' విజయవర్మ కూడా మెల్లగా సమాధానం చెప్పాడు. ఇదంతా తృటిలో జరిగిపోయింది. విజయవర్మ మళ్ళీ తలెత్తి చూచేటప్పటికి ఇంతసేపటినుంచీ గదిలో కూర్చొనిఉన్న కుర్రవాడు లేడు.

'ఆ కుర్రకుంకా నన్ను 'అబ్బాయీ!' అని పిలిచింది. సరే, వీడిపని పట్టకపోతా నటలే' అనుకొన్నాడు విజయవర్మ.

కొంతసేపటికి లేఖ వ్రాసి ఇచ్చాడు భీమవర్మ. అది తీసికొని విజయవర్మ గిరికోటకు మరలాడు. అతనలా వెళ్ళాడో లేదో, కోసల్బారు సామంతులలో ఒకడైనటువంటి చంద్రదుర్గాధిపతినుంచి భీమవర్మవద్దకు ఒకదూత వచ్చి, ఉదయంనుంచే యుద్ధం మొదలయ్యిందనీ, భీమవర్మ సాయం అత్యవసరమనీ చెప్పాడు.

కాని భీమవర్మ అతను చెప్పింది వినే స్థితిలో లేడు. 'కరుణ ఎక్కడకు

విజయవర్మ. 'అలాగా, సరే, నేను తీరికగా ఈ విషయాలన్నీ చెబుతాలే నీకు ఎపుడో ఒకసారి. అప్పుడు చండీదాసు చంపాడని అనుకొన్నారు జనులంతా. ఐతే కాలం కలిసి రాలేదు. అందువల్ల ఏమీ చేయటానికి వీలులేకపోయింది. సరే, నేనొక లేఖ రాసి ఇస్తాను. చలిది గుడిచి, నీవు అది తీసికొని వెంటనే తిరిగిపో." అన్నాడు భీమవర్మ.

అప్పుడు విజయవర్మ 'లేఖ ఇంకెవరి చేతికన్నా ఇచ్చి పంపించండి. నన్నుకూడా మీవెంట యుద్ధానికి రానివ్వం'డని అన్నాడు.

కాని భీమవర్మ ఇందుకు ఒప్పుకోలేదు. ఆయన ఉత్తరం రాసేలోపుగా విజయ








పోయింది? ఏదీ, ఆ అమ్మాయి ఏదీ?' అని అరుస్తున్నాడు. ఇది విని ఒకడు 'ఏ అమ్మాయండీ? ఇక్కడ అమ్మాయి లెవరూ లేనిదే?' అన్నాడు. 'ఇప్పటిదాకా నావెంట ఒక కుర్రాడు లేడూ? అతనేరా మూర్ఖుడా!' అన్నాడు భీమవర్మ. 'సరే, అతన్ని మీరు 'కరుణాకరా!' అని పిలచారే. అతను ఒక అరగంటముందే గుర్రమెక్కి వెళ్ళాడు' అన్నాడు నారాయణ అనేఅతను.

'అయితే నిలబడి చూస్తారేం? నారాయణా! నీవు సైనికులను తీసుకుని ఆ అమ్మాయిని వెంబడించి పట్టుకో. తీసుకెళ్ళి గిరికోటలో ఉంచు. లేకపోతే నీకు తెలుసుగా?' అని గర్జించాడు భీమవర్మ. వెంటనే నారాయణ ఒక ఆరుగురు సైనికులను తీసుకొని కరుణాకరుణ్ణి వెంబడించసాగాడు.

ముందుబయలుదేరినవిజయవర్మ గిరికోట వద్దనున్న ఊబి సమీపించేసరికి తొడలవరకు కూరుకుపోయిన ఒక గుర్రం కనుపించింది. రౌతుకూడా దగ్గరలోనే ఎక్కడో ఉంటాడని అనుకొంటూవుండగానే అతనికొక కుర్రవాడు కనుపించాడు. తాను భీమవర్మవద్ద చలిది గుడుస్తున్నప్పుడు తూరుపుకొండకు త్రోవ అడిగిన కుర్రవాడు అతనే. ఊబిలో దిగబడి చనిపోతున్న గుర్రం అతనిదేనని వెంటనే గ్రహించి విజయవర్మ అతన్ని తనవెంట రమ్మన్నాడు. అతనినికూడా తనగుర్రంమీద కూర్చోపెట్టుకున్నాడు.

ఇలా కొంతదూరం వెళ్ళినతరువాత 'నీ పేరేమిటయ్యా,' అని అడిగాడు. 'నాపేరు కరుణాకరు'డని ఆ కుర్రవాడు బదులు చెప్పాడు. 'భీమవర్మ నీకేమౌతాడు?' 'నాకేమీ కాడు. తన స్వార్థంకోసం బలవంతాన నన్ను బంధించాలని చూశాడు. అతని చేతికి చిక్కానంటే నాకు మూడిందన్నమాటే. అందుకనే తూరుపుకొండకు పోతున్నా నబ్బాయీ!' అన్నాడా కుర్రవాడు.




'మళ్ళీ 'అబ్బాయీ!' అంటావు? నీకేమి బుద్ధిఉందా, లేదా? నేను నీకంటే చిన్న వాడినా? ఐనా నీవు భీమవర్మవద్దనుంచి పారిపోతున్నావు. నీకు సాయంచేసినట్టు ఆయనకు తెలిసిందా, నాక్కూడా మూడు తుంది. లేనిపోని గొడవ నాకెందుకు?' అన్నాడు విజయవర్మ. ఇది విని ఆ కుర్రవాడు అతనిని దీనంగా వేడుకొన సాగాడు.

విజయవర్మకు జాలివేసి 'నీకేమీ భయం లేదు. నీప్రాణానికి నాప్రాణం అడ్డువేస్తా' నని చెప్పి అభయమిచ్చాడు. అతను అలా పలికాడోలేదో, వెనుకనుంచి వారికి స్పష్టంగా కేకలు వినిపించాయి. కాని అప్పటికే వారు ఇద్దరూ రేవువద్దకు వచ్చేశారు.

విజయవర్మ కేకవేయగానే పడవవాడు వచ్చాడు. కరుణాకరుణ్ణిచూచి 'ఇతనెవ'రని అడిగాడు. 'నాచుట్ట'మని విజయవర్మ చెప్పగా, ఒక్కసారి ఎగాదిగా చూచి నవ్వ సాగాడు. కాని విజయవర్మ కోపపడే టప్పటికి బలవంతాన నవ్వు అపుకొన్నాడు.

ఐతే, ఆ పడవవాడు విజయవర్మను మామూలు రేవులో దించలేదు. ఇది విజయ వర్మకు వింత గొలిపింది. కారణం అడిగే టప్పటికి పడవవాడు సైగచేశాడు. ఎదురుగా ఉన్న ఒక చెట్టుకొమ్మలపైన బాణం ఎక్కు పెట్టి గురిచూస్తున్నమనిషి 'ఎవరా వస్తున్న' దని కేకవేశాడు.

'ఎవరైతే నీకేం?' అని విజయవర్మ తిరుగుకేక పెట్టాడు. 'ఇతడు విజయవర్మ. మరెవరో కాద'ని పడవవాడు కేకపెట్టేలోపలే బాణం రయ్యిన వచ్చి విజయవర్మ గుర్రం గుండెల్లో నాటింది. ఈసందట్లో కరుణా కరుడు ముందే దూకి గట్టెక్కాడు. కాని విజయవర్మకూడా దూకేలోపలే గుర్రం పడిపోవటం, పడవ తల్లక్రిందులై విజయ వర్మ నీటిలో పడటం జరిగింది.






ఎలాగో తిప్పలుపడి విజయవర్మ ఒడ్డెక్కిందాకా కరుణాకరుడు పాపం, కదలలేదు. అక్కడ అడవి దట్టంగా ఉంది. ఇద్దరూ ఒక్క క్షణమైనా ఆగకుండా పరుగెత్తారు. కాని కొద్దిసేపట్లోనే కరుణాకరుడు అలిసిపోయి కుంటసాగాడు.

అప్పుడు విజయవర్మ కరుణాకరుడికి ఊతమిచ్చి నడిపించాడు. కొంతదూరం వెళ్ళినతరువాత విజయవర్మ చటుక్కున ఆగి అన్నాడు: "నిన్నుచూచి పడవవాడు ఎందుకు నవ్వాపుకోలేకపోయాడో నాకిప్పుడు అర్థమౌతున్నది. నీవిలా బక్కగా, బలహీనంగా, సుకుమారంగా ఉండటంచూచి ఆడపిల్లవనుకున్నాడు." "లేదు, లేదు" అన్నాడు కరుణాకరుడు సిగ్గుపడుతూ. 'అలాఅనకు. నిన్నుచూసి ఎవరైనా ఆడపిల్లవనే అనుకొంటారు. అతని తప్పేమీ లేదు!' అన్నాడు విజయవర్మ.

ఇలా కొంతదూరం వెళ్ళేసరికి ఒక లేడి వారి ఎదుటినించి పరుగులిడుతూవచ్చి రివ్వున దూసుకపోయింది. ఇంతవరకూ విజయవర్మా, కరుణాకరుడూ తాపీగానే నడుస్తున్నారు. కాని ఇది చూడగానే విజయవర్మకు అనుమానంతట్టింది. ఒక పొడుగాటి చెట్టు ఎక్కి చూచేటప్పటికి ఏటికి ఇవతల ఒడ్డున ఏదో కదులుతున్నట్టు కనుపించింది.

అనుమానం రూఢిఅయింది. ఇద్దరూ మళ్ళీ ముందుకు సాగి కొంతదూరం పోయి, గిరికోట అరణ్యంలో అవతల కొస చేరుకోబోయారు. ఇంతలో ఏదో అలికిడి అయింది. విజయవర్మ వెంటనే ఒక చెట్టు చాటున దాగాడు. కరుణాకరుడి కిది ఎంత మాత్రం అర్థంకాలేదు.

'హుష్!' అని విజయవర్మ వేలితో సైగ చేశాడు. వారికొక వందగజాల దూరంలో ఒక చెట్టుమీద ధనుర్బాణాలు చేపట్టివున్న ఒకమనిషి నిలచి, నలుదిక్కులా






పరికిస్తున్నాడు. 'ఎడంప్రక్కగా తప్పుకొని పోదాం పద' అన్నాడు విజయవర్మ. వారలా కొంతదూరం వెళ్ళారు. ఆ ప్రదేశమంతా విజయవర్మకుకూడా క్రొత్తగాఉంది. అందు వల్ల జాగ్రతగా ముందుకు సాగుతున్నారు.

ఇంతలో ఒక గొంతుక ఏదో పాట ఎత్తు కుంది. ఇద్దరూ ఆగిపోయారు. చూస్తే వారికి ఎదురుగా ఒక కందకం ఉంది. పక్కనే పాడుబడిన కట్టడం ఒకటి ఉంది. అక్కడే ఒక పొయ్యికూడా రాజుతూఉంది. దొంగల వేషంలోవున్న ఒక మనిషి పొయివద్ద కూర్చొని ఏదో పాడుతున్నాడు. ఇంకా ఒక రిద్దరు దగ్గరలోనే పండుకొని ఉన్నారు.



వంట అయినట్టుంది. వంటచేస్తున్న మనిషి ఈల వేయగానే చుట్టుపక్కల ఎక్కడినించి వచ్చారో, మరి ఒక ముప్పయి నలభైమంది బిలబిలలాడుతూ పళ్ళాలు పట్టుకొని వచ్చారు.

వారందరూ కూచున్నతరువాత రాజసం ఉట్టిపడుతున్న ఒక మనిషి వచ్చి కూర్చు న్నాడు. వైఖరినిబట్టి చూస్తే అతడే వారి నాయకుడిలా కనుపించాడు. 'అబ్బాయిలూ, త్వరగా కానివ్వండి. త్వరగా వడ్డించు ధనపాల్ ! చిన్నపని ఒకటిఉంది చేయువల సింది' అన్నాడు అవ్యక్తి. భోజనాలై పోయేటంతలో ఒక బాణం రివ్వున వచ్చి పాడుబడిన కట్టడపు గోడకు తగిలి ముక్కలు ముక్కలై క్రిందపడింది. ఇది ముందే అనుకొనిన సంజ్ఞకామోసు. ఎందుకంటే ఇది చూచినవెంటనే ఎక్కడివాళ్ళక్కడ చేతులు కడుక్కొని లేచారు. నాయకుడు అందరికంటే ముందే ధనుర్బాణాలు చేపట్టి అన్నాడు—

'అబ్బాయిలూ ! భీమవర్మో, లేక అతని బంటులో మరికొందరు చిక్కారు. జ్ఞాపకముంచుకోండి. దిక్కులేక చచ్చిన అభయవర్మ ఒక్కడిదే కాదు. ఇంకా





ఎంతమందిదో మనం పగతీర్చుకోవాలి.'

ఇలా అనేసరికి, అడవిలో ఎక్కడివాళ్లక్కడ మాయమయ్యారు. విజయవర్మకూ, కరుణాకరుడికీ వ్యవధి చిక్కింది. 'మనం పోదాం' అన్నాడు కరుణాకరుడు.

'బలేవాడివయ్యా!' అన్నాడు విజయవర్మ.

'భీమవర్మ సైనికులను నీవు రక్షిస్తావా? దొంగలనాయకుడన్నది వినలేదా? అభయవర్మ ఎవరు? నీ తండ్రికాదా?' అన్నాడు కరుణాకరుడు. 'దొంగలమాటలా నమ్మటం?' అంటూ విజయవర్మ వెనుదిరుగాడు. కరుణాకరుడూ వెంబడించాడు.

చాలాదూరంలో విజయవర్మకు నారాయణా, అతని జట్టువారూ గుర్రాల మీద కనుపించారు. వారు తెరిపిగా ఉన్న చోటికి వచ్చేసరికి నాలుగువైపులనుంచీ బాణాలవర్షం కురియసాగింది. వారు ఉక్కిరిబిక్కిరయారు.

శత్రువెక్కడా కనపడడు. బాణాలు మాత్రం మిత్తవలావచ్చి ప్రాణాలు హరించుకపోతున్నయి. నిముసంలో కథ ముగిసిపోయింది. నారాయణ ఒక్కడే మిగిలాడు. ఒక్కసారి నలుదిక్కులా పరికించి అతడు పరుగు లంకించుకొన్నాడు.



అతని చర్యలన్నీ కనిపెడుతున్న శత్రువులు పొట్టలు చెక్కలయ్యేట్టు నవ్వారు. నారాయణకు కోపంవచ్చి గ్రుడ్డిగా ఒకబాణం అడవిలోకి వదిలాడు. అదృష్టవశాత్తు అది ఎవరికో తగిలి, ఒకకేక వినవచ్చింది.

వెంటనే బాణాలవర్షం కురియసాగింది. పారిపోతున్న నారాయణ ప్రాణం దక్కించుకోవాలని చూశాడు. తప్పించుకొంటాడో లేదో అని విజయవర్మా, కరుణాకరుడూ రెప్ప వాల్చకుండా చూస్తున్నారు.

ఇంతలో ఒక బాణంవచ్చి గుండెలో గుచ్చుకొని నారాయణ పడిపోయాడు. విజయవర్మ అతనివద్దకు పరుగెత్తాడు. కాని



'అభయవర్మ కొడుకుని చంపవద్దని చండీదాసు ఆజ్ఞ' అని ఎవరో వేసిన కేక విజయవర్మ ప్రాణాలను రక్షించింది.

అతనూ కరుణాకరుడూ పరుగెత్తారు. సద్దు మణిగేదాకా ఎక్కడా ఆగలేదు. తిరిగి బయలుదేరుదా మనుకొనేటంతలో పారిపోతూవున్న గుంపులు కనుపించినై. దీనినిబట్టి యుద్ధంలో కోసల్వారు ఓడిపోయినట్టు గ్రహించాడు విజయవర్మ. మరి భీమవర్మ ఏమైనట్టు?

ఇంతలో వారికి 'డబుకుడబుడుక్కు' అనేశబ్దం వినిపించింది. ఉన్నకొద్దీ ఆ శబ్దం దగ్గరగా రాసాగింది. బుడబుక్కలవాడు వచ్చాడు. వానిని చూడగానే కరుణాకరుడు ఒక్క కేకతో స్పృహతప్పి పడిపోయాడు. విజయవర్మా గాబరాపడ్డాడు. అతనెవరో కాదు, భీమవర్మే. 'ఏం విజయా! మంచి స్నేహితుణ్ణి సంపాదించావే? అతని పేరన్నా తెలుసా నీకు' అన్నాడు బుడబుక్కలవేషంలో వున్న భీమవర్మ విజయునితో. 'ఇతని పేరు కరుణాకరుడు గదండీ! మీరీవేషంలో ఉన్నారేమండీ!' అన్నాడు విజయవర్మ. ఇది విని భీమవర్మకు కోపం వచ్చింది. 'ఏం చేసేది, మన పక్షం ఓడిపోయింది. మనవాళ్లంతా ఏమయ్యారు? ఇతనెక్కడ కలిశాడు నీకు?' అన్నాడు.

'త్రోవలో కలిశాడు. నారాయణ వాళ్లు...' అని అంటుండగానే, 'ఏరి వాళ్లంతా?' అని అడిగాడు భీమవర్మ. విజయవర్మ భయపడుతూ, జరిగినదంతా చెప్పాడు. భీమవర్మ మండిపడి, 'ఐతే, నేను గిరికోట చేరుకుంటాను. నీవు నీ స్నేహితుణ్ణికూడా వెంటతీసుకొని రా' అని చెప్పి, విజయవర్మ చేత ఒట్టువేయించుకుని వెళ్ళిపోయాడు.

వాగ్దానంప్రకారం విజయవర్మ కరుణాకరుణ్ణి వెంటబెట్టుకొని గిరికోటకు తీసుకెళ్లక తప్పలేదు. వారికోసం భీమవర్మ అక్కడ సిద్ధంగా వేచివున్నాడు. —(ఇంకా వుంది)






# పావనం

పూర్వం ఒక భక్తుడు. అతనికి యాత్రలు సేవించుకుందామనే అభిలాష మిక్కుటంగావుండేది. ఐతే ఇల్లు కదలటానికి ఎంత మాత్రమూ వీలులేకపోయింది. ఏమంటే వృద్ధులైన తలిదండ్రులు అతనిమీదనే ఆధారపడివున్నారు. కనుక, క్షణంసేపైనా వాళ్లను విడిచిపోవాలంటే సాధ్యమయ్యే పనిగా కనిపించలేదు.

ఈస్థితి భక్తుని మనస్సుకు చాలా కష్టం కలిగించింది. 'ఈ ముసిలివాళ్లను వదిలి నేను యాత్రలు చేసుకునేదేమిటి? నాకిక మోక్షం కలిగేదేమిటి?' అని నిరాశచెంది అతను విచారింపసాగాడు.

యాత్రలమీద దీక్షపట్టిన ఆ భక్తుడికి చివరకు జీవితంపైనే విరక్తి కలిగింది. 'ఈ ముసిలివాళ్ళను వదిలేసి పోదామా?' అనికూడా అనిపించేది. ఇలా వుండగా, అతనికి ఒక మంచి సావకాశం దొరికింది.

అతని బంధువే ఒకాయన 'నాయనా! నువు పోయి యాత్రలుచేసుకురా. నువ్వు తిరిగివచ్చేదాకా ముసిలివాళ్లను నేను కనిపెట్టుకువుంటాలే' అన్నాడు. ఈధీమా చూచుకొని భక్తుడు వెంటనే బయలుదేరాడు.

అతను పోయిపోయి కొన్నాళ్ళకల్లా ఒక అరణ్యమార్గం ప్రవేశించాడు. ఆ అరణ్యంలో కుక్కుటముని అనే ఒక మహానుభావుడు ఉన్నట్టూ, ఆయన దర్శనంచేసి ఎంతోమంది తరించుతున్నట్టూ విన్నాడు.

తీరా ఆశ్రమానికి వెళ్ళిచూస్తే, భక్తుడు తలిచినట్లు ఆ కుక్కుటముని తపస్సూ చేసుకోవటంలేదు, ఏమీ లేదు. సామాన్యగృహస్థులాగానే సంసార తాపత్రయంలో మునిగివున్నాడు. భక్తుడు ఆయన చర్యలన్నిటినీ శ్రద్ధతో గమనిస్తూ కూర్చున్నాడు.

ఆ ముని వంటచేశాడు. అక్కడ వుండే ముసిలి దంపతులకు వడ్డించాడు. వాళ్ళ

పాలంకి వెంకటరామచంద్రమూర్తి




సదుపాయాలన్నీ చూచాడు. ఇదంతా పూర్తి ఐనతరవాతనే ఇవతలకు వచ్చాడు. వచ్చి, తనకోసం కూర్చునివున్న భక్తుని చూచి, 'నాయనా, ఏంపనిమీద వచ్చావు?' అని అడిగాడు.

అందుకు భక్తుడు "మహాత్మా!—నేను యాత్రలకోసం బయల్దేరి, తమపేరు విని దర్శనం చేసుకుపోదామని వచ్చాను. త్రివేణిసంగమం ఇక్కడికి సమీపంలోనే వున్నదంటారే. కొంచెం తోవ చెబుతారా?" అన్నాడు వినయంగా.

ఈమాటకు ముని "నాయనా!—వృద్ధులైన నా తలిదండ్రులను సేవించుకోవాలి. వారిని విడిచి ఎక్కడకూ వెళ్ళలేను. అందుచేత, త్రివేణికి త్రోవ నాకు తెలియదు" అని బదులుచెప్పి, లోపలికి వెళ్ళిపోయాడు.

తనకు తరుణోపాయం చూపిస్తాడని అనుకున్న ఆ మునికి, దగ్గరనే వున్న త్రివేణిత్రోవ ఎక్కడ వుందో తెలియదనటంతో భక్తునికి ఆయనమీద వుండిన గౌరవం కాస్తా పోయింది. 'ఈ మునినిగురించి చెప్పుకొనే గొప్పయేమిటో బోధపడటంలేదే!' అనుకొని అలోచిస్తూ అక్కడనే నిలబడ్డాడు.

అంతలో, ముగ్గురు స్త్రీలు అటే వచ్చి ఆశ్రమంలో ప్రవేశించారు. వాళ్ల ముగ్గురి రూపాలూ, చూడటానికి రోతగా కనిపించినై. వీళ్ళు రావటంతో భక్తునికి జిజ్ఞాస మరీ ఎక్కువై అక్కడనే వేచిఉన్నాడు.

మరికొంచెంసేపటికల్లా ముగ్గురు అప్సరసలు ఆశ్రమం లోపలినించి ఇవతలకు వచ్చారు. భక్తుని ఆశ్చర్యానికి మేర లేకపోయింది. ఇక ఉండబట్టలేకపోయాడు.

ఆ అపరూప సౌందర్యవతుల వంక తిరిగి "అమ్మా!—మీ రెవరు? మీకిక్కడ ఏమి పని?" అని ఆత్రంతో ప్రశ్నించాడు.

అప్పుడా సుందరీమణులు ఇలా చెప్పారు: "నాయనా!—మేం ముగ్గురమూ

అక్కా చెల్లెళ్లం. ఈ లోకంలో మమ్మల్ని గంగ, యమున, సరస్వతి అని పిలుస్తారు. ప్రయాగవద్ద మేం ముగ్గురమూ కలిసి నదుల రూపంలో ప్రవహిస్తూ వుంటాము. పాపాలు పోగొట్టుకోవాలనే తాపత్రయంతో దేశదేశాలనుండి జనంవచ్చి మాలో స్నానం చేస్తారు. కన్న తల్లిదండ్రులను ఉపేక్షచేసే వాళ్ళూ, మరి అనేక మహాపాతకాలు చేసిన వాళ్ళూ వచ్చి మునగటంతో మాకు ఇటువంటి అసహ్యకరమైన రూపాలు వస్తుంటై. అలాంటి స్థితిలో వుండిన మేమే నీవు మొదట చూచిన వికార స్వరూపులం."




"మరి మీరెవరు?" అని మళ్ళీ ఆత్రంతో అడిగాడు భక్తుడు.

"ఆ వికారస్వరూపులమే మేము. అప్పుడప్పుడు ఈ ఆశ్రమానికి వచ్చి, ఈ మహానుభావుని దర్శనంచేసుకోవటంతో మా పాపాలన్నీ తొలగిపోయి, మేము నిజస్వరూపాలతో మళ్ళీ ఇవతలకి వస్తూవుంటాము. మాకు చుట్టుకున్న పాపాలు మిక్కుటమైనప్పుడల్లా మేమీ మహాత్ముని దర్శనానికి వస్తూంటాము" అంటూ అదృశ్యమయ్యారు.

భక్తుని మనసులో అప్పుడు కలిగిన భావాలకు అంతు లేకపోయింది. అతనిలో గొప్పమార్పు వచ్చింది. చిరకాలంనుండి అతనిలో ఉంటూవున్న యాత్రాభిలాష వెంటనే సమసిపోయింది. మరొక్క అడుగైనా ముందుకు వేయక, తక్షణమే అతను ఇంటికి మరలిపోయాడు. ఆనాటినుంచీ అతను తలిదండ్రులనే ప్రత్యక్షదైవాలుగా ఎంచి, వారిని భక్తితో సేవించుకోసాగాడు.

అతను శ్రమపడి సేవించుకుందామనుకొన్న ఆ గంగా, యమునా, సరస్వతులు ఈవిధంగా తన కళ్లఎదటనే తాండవించటం మహాభాగ్య మనుకొన్నాడు.

అప్సరసల రూపంలో ఆనాడు కనబడిన ఆ ముగ్గురు అక్కాచెల్లెళ్లనూ స్మరిస్తూ, ఆ భక్తుడు ధన్యుడైనాడు.

# 9 మాహాత్మ్యం

(1) కిందటి సంచికలో 9 చేత భాగించగా వచ్చే శేషంగురించిన తమాషా తెలుసుకొన్నాము. ఇప్పుడు 9 చేతభాగిస్తే శేషం మిగలకుండావుండేది ఎలా అనేవిషయం తెలుసుకొందాం :

మచ్చుకి 16486 అనే సంఖ్య తీసుకో. ఈ అంకెలన్నీ కలపగా వచ్చే మొత్తం 25. పైసంఖ్యలోనించి 25 తీసివేస్తే మిగిలేది 16461.
ఈ 16461 ని 9 పెట్టి భాగించగా 1829 వస్తుంది. శేషం ఏమీ మిగలదు.
ఇలాగే మరేసంఖ్యఐనా.

—ఎస్. నాగరాజన్ - సేలం

(2) 'తొమ్మిది' అంకెలతో ఒక చిత్రమైన కూడిక చూడండి—

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
| 9 | 9 | 9 | 9 | 9 | 9 | 9 | 9 | 9 |
| 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |

—కవుతా లలితామనోహర్ - విజయవాడ

(3) తీసివేతలో గారడీ : ఏదైనా ఒక సంఖ్య తీసుకో : మచ్చుకి 64328. ఈ ఐదు అంకెలనూ మొత్తంచేస్తే 23 వస్తుంది. ఇప్పుడు ఈ 64328 లోనించి ఆ 23 ను తీసివెయ్యి. మిగులు 64305. ఈ ఐదు అంకెలలో నీ స్నేహితుణ్ణి ఏదోఒక అంకె తలుచుకొని మిగిలిన అంకెల మొత్తం చెప్పమను. ఉదాహరణకు అతను 4 అంకె తలుచుకొన్నాడనుకొందాం. దీనిని సులువుగా చెప్పేసుకోవచ్చు.
ఎలాఅంటే–నీస్నేహితుడు తలుచుకొన్న 4 అంకెగాక, తక్కిన అంకెలు 6305. వీటి మొత్తం 14. ఈ 14 ను మళ్ళీ కూడితే 1+4=5. ఇలా కలపగా వచ్చిన మొత్తాన్ని '9'లో తీసివేస్తే 4. ఇదేకద నీ స్నేహితుడు తలుచుకొన్న అంకె?

—డి. సిద్దరామప్ప - మద్దికెర (కర్నూలు జిల్లా)

(4) పది మొదలుకుని 1 వరకు అంకెలు వరసగా వేసి, అలా వేయగా వచ్చిన సంఖ్యను 9 చేత గుణించు. గుణించగా వచ్చే మొత్తంలోని చమత్కారం గమనించు.

$$\begin{array}{r} 10987654321 \\ 9 \\ \hline 98888888889 \end{array}$$

[వచ్చేనెల మరికొన్ని]

—గిరిజాశంకర్ వి. మెస్త్రా - సిర్పి




# పరిపరివిధాల

అనగనగా ఒకవూరిలో పటాలవర్తకుడు ఉండేవాడు. అతను తరుచు, పెద్ద ధరలకు కొనితెచ్చిన చిత్రపటాలను తక్కువ ధరలకు అమ్మవలసివస్తూండేది. ఒక్కొక్కప్పుడు పటాలు ఎంతకూ అమ్ముడుపోక నిలవ ఉండిపోవటంవల్ల, విసుగుచేత ఏదో ఒక ధరకు విడుదల చేస్తూవుండేవాడు. ఎంతకైనా సరే విడుదల చేయటానికి సిద్ధపడినా, పటాలు కొనేవాళ్ళు అభిమానం చేతనే తీసుకొంటున్నట్టు కనిపించేవాళ్ళు.

ఒకసారి, ఆ వర్తకుడు ఒక పుణ్యస్థలానికి వెళ్ళడం తటస్థించింది. అక్కడ పురాతన వస్తువులు విక్రయించే అంగళ్ళు వున్నాయి. వాటిని చూచుకొంటూ రాగా రాగా, ఒక దుకాణంమీద ఒక చిత్రపటం అతని దృష్టిని ఆకర్షించింది.

అది నీటిరంగులతో చిత్రించిన వొక అద్భుత చిత్రం. ఆ చిత్రం యెవరో గొప్ప చిత్రకారుడు తయారుచేసిందై వుండాలి కాని, సామాన్యుడు వేసిందిమాత్రం కాదు. ఐతే, పటంమీద పేరు లేకపోవటంచేత, ఎవరు వేశారో తెలియదు. ఏమైతేకానీ అని తలిచి, వర్తకుడు "పటం వెల యెంత?" అని ఆ దుకాణదారుని అడిగాడు.

అందుకు దుకాణదారు ఇలా చెప్పాడు: "అయ్యా!—ఈపటం చూచినవాళ్లందరూ 'ఇది రవివర్మపటంలాగా వున్నది' అని మెచ్చుకొంటున్నారు. ఐతే, పటంమీద ఆయన సంతకం లేకపోవటంచేత యేమి నిశ్చయించటానికీ వీలులేకుండా వుంది. చిత్రకారుని సంతకంలేదు గనుక, ఐదు రూపాయిలు మాత్రమే చెబుతున్నాను. ఇష్టమైతే తీసుకోవచ్చు" అన్నాడు.

చిత్రకారుని సంతకం లేదు అనగానే, వర్తకుడు ఆలోచనలో పడ్డాడు. అప్పుడు దుకాణదారు మళ్ళీ అన్నాడు: "నే నీపటం

కె. లక్ష్మీనరసింహరాజు




బొంబాయిలో కొన్నాను. వారం రోజులలో మళ్లా అక్కడకు వెళదామనుకొంటున్నాను. అప్పుడు వాకబుచేస్తాను. ఇది రవివర్మ పటమే అని నిశ్చయమైతే ఇక దాని వెల ఇంత అని నిర్ణయించటానికే వీలుపడదు. ఇప్పుడు మాత్రం ఆసంగతి రూఢిగా చెప్ప లేను. అందుకనే, ఇంతటి గొప్పపటాన్ని ఐదురూపాయలకే ఇవ్వటానికి సిద్ధంగా వున్నాను. తరువాత మీయిష్టం".

వెంటనే వర్తకుడు ఐదురూపాయలూ ఇచ్చి ఆ పటం తీసుకొన్నాడు.

వర్తకుడు తన వూరు చేరుకొని కొత్తగా కొన్న ఈ పటాన్ని తన దుకాణంలో వేల



గట్టేసరికి, అధి అందరనూ అకర్షించింది. దానిని కొనటానికి పెద్దపెద్దలంతా పోటీ పడసాగారు. ఆ పటంయొక్క బాణీ కని పెట్టిన వారందరూ అది రవివర్మ వేసిన పటమే కాని మరొకరిదికాదు అని నిర్ధారణ చేశారు. ఎలా ఐతేనేం, ఒకాయన దానిని వంద రూపాయలిచ్చి కొనుక్కుపోయాడు.

ఇది వర్తకుని జీవితంలో ఒక అపూర్వ ఘట్టం. అంత తక్కువ వెలకు కొన్న ఒక బొమ్మను ఇంత పెద్ద విలువకు విక్రయించటమనేది ఇంతవరకు ఎన్నడూ జరిగి వుండలేదు. ఈ అదృష్టం చూచుకొని అతను పొందిన ఆనందానికి మేరలేకపోయింది.

వెంటనే అతనికి ఒక చక్కటి అలోచన తట్టింది : 'నా ఈ అదృషానికి కారకుడు ఆ దుకాణదారు. నిజానికి అతను చాలా న్యాయవంతుడు. పటంయొక్క మంచి చెడ్డలు దాపరికం లేకుండా, ఉన్నది ఉన్నట్టు నాకు చెప్పాడు. సరీగా అతను చెప్పినట్టుగానే, యిది రవివర్మపటమని నమ్మి, ఈ పటంమీద మోజుపడ్డారందరూ. కనుక, నా లాభంలో సగం ఆ దుకాణదారుని కివ్వటం న్యాయం' అని తలిచాడు.

ఈ తలంపు కలిగినవెంటనే, ఆ దుకాణదారునికి ఒక ఉత్తరంద్వారా తన వుద్దేశం



తెలుపుదామనుకొని తపాలాఫీసుకి వెళ్ళాడు. తీరా అతను అక్కడికి వెళ్ళేసరికి ఆఫీసు మూసివేశారు. బిళ్ళలు దొరకలేదు. అందుచేత ఉత్తరం పడవేయటం జరగలేదు.

మరునాడు తెల్లవారుజామున అతనికి ఈ సంగతి మళ్ళీ జ్ఞాపకంవచ్చింది. 'ఆ దుకాణదారునికి జాబువ్రాయటం పిచ్చిపని లాగా తోస్తున్నది. ఇది రవివర్మపటమే అన్న సంగతి అతనికి తెలిసే నాకు విక్రయించాడు, కాని తెలియకపోలేదే! కనుక, లాభంలో సరిగా అర్ధభాగం ఎందు కివ్వాలి నేను? పదిరూపాయలిస్తాను. సరిపోతుంది' అనుకొన్నాడు.



తరువాత, ఈ మాట వెనుకపెట్టి, తన పని చూచుకోసాగాడు. మళ్ళీ ఒకసారి పటంసంగతి జ్ఞప్తికి వచ్చింది. ఈసారి, అతని మనసు మళ్ళీ కలవరపడింది.

'నేనా దుకాణదారునికి పదిరూపాయలు పంపితే కీడుచేసినవాడి నవుతున్నాను. ఎలా అంటే: ఈ పదిరూపాయలూ చేరితే, తనవద్ద సరకు కొనే ప్రతివారూ నాలాగానే ఉదారులై వుంటారనీ, న్యాయమూ ధర్మమూ పాటించి డబ్బు పంపుతూ వుంటారనీ భ్రమపడతాడు. ఈ భ్రమ లేనిపోని ఆశ కలిగిస్తుంది. ఆశ దురాశగా మారి, చివరకు అది దుఃఖం కలిగించవచ్చు. అందుచేత పదిరూపాయలుకూడా అతనికి పంపటం మంచిదికాదు' అని నిశ్చయించాడు.

'పోనీ, పది వద్దు, అతని మేలు కోరి ఐదురూపాయలు పంపుతా. అప్పుడు నేను చేసిన పని కేవలమూ స్వలాభం అనిపించుకోదు' అనుకొన్నాడు.

ఆ మరునాడు అతను దుస్తులు వేసుకొంటున్నప్పుడు మళ్ళీ ఈ సంగతి స్ఫురణకు వచ్చింది.

రాగానే, అతను "లక్ష్మి నన్ను కోరి వరించింది. అందుచేతనే, ఆ పటం ఎక్కువ వెలకు నావద్ద విక్రయమైంది. భాగ్యదేవత

నాకు అనుగ్రహించినదానిని మరొకళ్ళకు ధారపోయటం ఏమి వివేకం? ఏమో!- మనసులో అనుకొన్నాను, ఆ దుకాణదారునికి ఏమైనా ఇద్దామని. తీరా అనుకొన్నాను కనుక ఒక్క రూపాయి ఇస్తాను. అంతే.

నిజానికి, 'నీవద్ద నేను కొన్నటువంటి పటానికి ఇంత లాభం వచ్చింది' అని ఒక జాబు వ్రాస్తేనే చాలు, దుకాణదారు ఎంతో సంతోషిస్తాడు. అటువంటిది, నా కృతజ్ఞత తెల్పుతూ ఒకరూపాయి బహుమానంకూడా పంపుదా మనుకొంటున్నానే. ఇంతకంటె యేంకావాలి" అనుకొని సమాధానపెట్టుకొన్నాడు.

ఇలా తలిచి, వర్తకుడు ఒక రూపాయి నోటు తీసి, కవరులోపెట్టి, తపాలలో పంపుదామని సిద్ధంచేశాడు. అది జేబులో వుంచుకుని భోజనంచేసి వద్దామని ఆ మట్టునే వెళ్ళాడు. తరువాత అతను తపాలాఫీసుకు వెళుతుండగా దారిలో ఒకచోట జూదమాడేవాళ్ళు కనిపించారు. అతనికి దుర్బుద్ధి కలిగి, జూదంలో కూర్చున్నాడు. సొమ్మంతా పోగొట్టుకొన్నాడు. చిల్లరకూడా మిగలలేదు. నిస్పృహతో లేచిపోతూ జేబు తడుముకొనేసరికి, చేతికి కవరు తగిలింది.

ఆ కవరులో ఉన్న రూపాయతో మళ్ళీ కూర్చుని జూదమాడి, పోగొట్టుకున్న సొమ్మే గాక, మరికొంత సొమ్ము కూడా గెల్చుకున్నాడు. చివరకు చూచుకొనేసరికి, తన డబ్బుగాక పైగా వందరూపాయలు అదనంగా గెల్చుకున్నట్టు తేలింది.

మారుఆలోచన లేకుండా అతను మొదట అనుకొన్న మొత్తం పూర్తిగా ఆ దుకాణదారుకి పంపించివేశాడు.

అతను సద్బుద్ధితో ఆ దుకాణదారుకి పంపదలుచుకొన్న ఒక్క రూపాయీ చివరికి అతనిని ఈవిధంగా రక్షించింది.





# రాజవిగ్రహం

SANKAR

అనగనగా ఒక పట్టణం. ఆ పట్టణం మధ్యలో పెద్ద రాతిస్తంభంమీద రాజుగారి బంగారు విగ్రహం ఉండేది. ఆ విగ్రహం కళ్ళకు రెండు నీలాలు పొదగబడినవి; రాజుగారి ఖడ్గంమీద పెద్ద రత్నం పొదగబడింది. విగ్రహంమీద సూర్యకిరణాలు పడి, మెరిసినప్పుడు రాజుగారు కేవలం ఆనందస్వరూపుడని అనిపించేది.

ఒకనాటి సంధ్యా సమయాన ఒక పిచ్చుక ఆ పట్టణంలో ప్రవేశించింది.

రాత్రి ఎక్కడ గడపటమా అనే ఆలోచనలో వున్న పిచ్చుకకు, వూరిమధ్యనున్న విగ్రహం కనుపించింది. "ఎత్తున వుంటే మంచిగాలి వస్తుంది, వూరుకూడా బాగా కనిపిస్తుంది" అనుకొని, విగ్రహం పాదాల వద్ద మకాంచేసింది. పిచ్చుక కన్నుమూద్దామనుకునే సమయానికి ఒక పెద్ద నీటి చుక్క మీదపడింది: అది అటూ ఇటూ పారచూసింది. ఆకాశంలో మబ్బుతునకన్నా లేదు. చంద్రుడూ, నక్షత్రాలూ కనిపిస్తూనే ఉన్నవి. ఏమిటీ చిత్రం? అనుకుంటూండగా మరో పెద్ద నీటిచుక్క మీద పడింది. పిచ్చుకకు అనుమానంవేసి తల పైకెత్తి చూసింది. విగ్రహం కన్నీరు కార్చుతున్నది. ఎప్పుడూ ఆనందంగా వుండే విగ్రహం చెంపలమీద కన్నీరుచూచి పిచ్చుకకు జాలి కలిగింది. 'మీరెవరు?' అన్నది పిచ్చుక.

"నేను దుఃఖమెరుగని రాజును!" అన్నది విగ్రహం. 'మరి ఎందుకు దుఃఖిస్తున్నారు?' అన్నది పిచ్చుక.

ఆ విగ్రహం జవాబిచ్చింది: "నేను బ్రతికివున్నన్నాళ్ళూ ఎన్నడూ బాధపడలేదు. కోటలో దుఃఖానికి ప్రవేశంలేదు. ఎంతో హాయిగా వుండేవాణ్ణి. కోట అవతల ఏమున్నదో నేనెప్పుడూ విచారించలేదు.

డి. హనుమంతరావు




చచ్చిపోయాక నా విగ్రహన్ని ఇంత ఎత్తున ప్రతిష్ఠించారు. ఇక్కణ్ణుంచి పట్టణంలో జరిగే సంఘటనలన్నీ కనిపిస్తున్నవి. నా హృదయం సీసంతో పోతపోసినదైనా చాలా జాలిగలది. మరి ఏడవక ఏంచేయను ?"

తనతో మాట్లాడుతున్నది ఒక విగ్రహమన్నసంగతి జ్ఞాపకంవచ్చి అప్పుడు పిచ్చుక చాలా ఆశ్చర్యపడింది.

విగ్రహం మళ్ళీ అన్నది: "దూరాన ఒక పూరింటిలో ఒక బీదకుటుంబం వుంది. ఒకామె బక్కచిక్కన శరీరంతో, పాలిపోయిన ముఖంతో, గుడ్డిదీపం పెట్టుకొని కుట్టుపని చేస్తున్నది. పలుమార్లు సూది చేతివేళ్ళలో గుచ్చుకుంటూన్నా ఆమె లెక్కచేయటంలేదు. పక్కనవున్న మంచంమీద జబ్బుపడిన బిడ్డ పడుకొనివున్నాడు. వాడికి ఆకలవుతోంది. నారింజరసం ఇమ్మని తల్లిని వేధిస్తున్నాడు. పాపం ఆమె నారింజరసం ఎక్కడతెస్తుంది? ఆ బాధచూస్తే నాకన్నీరు ఆగటంలేదు. పిచ్చుకా! నాకో సహాయం చేయగలవా ?"

"ఏమిటది ?" అన్నది పిచ్చుక.

"చూడు, నాకత్తిలో విలువైన రత్నం పొదగబడివుంది. దీన్ని ఆమెకు ఇచ్చిరావాలి. నేనా కదలలేను. చూస్తున్నావుగా, నాకాళ్లను రాతిస్తంభంలో తాపటంచేశారు!"

"పగలంతా ఎగిరి ఎగిరి అలసిపోయాను. మళ్ళీ తెల్లారుజామునే ఎగిరి పరదేశం పోవాలి–" అంది పిచ్చుక.

"కష్టాల్లోవున్నవారిపట్ల సానుభూతి కావాలి–" అని రాజు కళ్లనీళ్ళ పర్యంతమయ్యాడు. పిచ్చుకకు నిజంగానే జాలివేసి రాజుకు సాయంచేయటానికి ఒప్పుకుంది.

రాజు చెప్పిన ప్రకారం, అది అతని ఖడ్గంమీది రత్నాన్ని ముక్కుతో కరుచుకొని ఇళ్లకప్పులమీదినుంచి ఎగిరిపోసాగింది.

చివరకు ఆ బీద ఇంటికి జేరింది. కుర్రాడు బాధతో అటూ ఇటూ దొరలు

తున్నాడు. తల్లి అలసిపోయి, నిద్రపోతోంది. పిచ్చుక మెల్లిగా ఆమెను పక్కకు నెట్టి కుర్రవానికి తన రెక్కలతో విసరసాగింది. ఆ చల్లనిగాలి హాయిగా వుండి, అతనికి చప్పున నిద్రపట్టింది.

పిచ్చుక రాజుదగ్గరకు వెళ్ళి జరిగినదంతా చెప్పి అన్నది: "బలే! ఇంత చలిలోనూ నాకేదో హాయిగావున్నట్లు వుంది!"

"నిజమే! మంచిపని చేసినందువల్ల అలా అనిపిస్తుంది" అన్నాడు రాజు.

మర్నాటి ఉదయం అంత చలిలోనూ పిచ్చుక పట్టణమంతా తిరిగింది. మిగతా పిచ్చుకలు, ఈ కొత్త పిచ్చుకలో ఏదో విశేషమున్నట్లు చూశాయి; కొత్త పిచ్చుక నిజంగా గర్వపడగలిగిందికూడాను!

రాత్రి చంద్రోదయమయ్యాక, పిచ్చుక రాజుదగ్గరకు వెళ్ళి "ఈరాత్రి నేను ప్రయాణమౌతున్నాను" అంది.

"పిచ్చుకా! ఆ దూరాన ఒక శిథిల గృహంలో ఒక యువకకవి ఉన్నాడు. అతను కాగితాలముందు అలసిపోయి కూర్చున్నాడు. ఈ చలికి వేళ్లు కొంకరులుపోయి, ఆకలికి తట్టుకోలేక, రాయలేని స్థితిలో బాధపడుతున్నాడు'—అన్నాడు దుఃఖమెరుగని రాజు.




యీసారి పిచ్చుక బతిమాలించుకోలేదు. "సరే—యీరాత్రికూడా నీవద్దే వుంటాను. ఒక రత్నాన్ని ఆయువకునికి ఇచ్చిరానా?"

"నాదగ్గర మరి రత్నాలు లేవు. కాని నా రెండు కళ్లకుగాను రెండు నీలాలు ఉన్నవి. ఒక నీలంతీసి అతనికి ఇచ్చిరా!"

"మీ కంటిని తీయలేను" అని పిచ్చుక ఏడవసాగింది.

"నేను చెప్పినట్లు చెయ్యి పిచ్చుకా!" అని రాజు బతిమాలాడు. చివరకు పిచ్చుకకు తప్పలేదు.

నీలం ముక్కున కరుచుకొని పిచ్చుక ఎగిరిపోయింది. ఆ కవిగారి ఇంటికి తలు




పులు లేనందువల్ల లోన ప్రవేశించటం కష్ట మవలేదు. కవి అలసిపోయి రెండుచేతులలో మొగంకప్పుకొని ఉండటంవల్ల పిచ్చుక వచ్చినసంగతే తెలియదు. కాస్సేపటికి మత్తువొదలి చూసుకునేప్పటికి పక్కన నీలం వున్నది. "నా రచనల్ని ప్రజలు మెచ్చుకుంటున్నారు. ఎవరో నాకీ కానుక పంపారు!" అనుకున్నాడు కవి.

మర్నాడు పగలు పిచ్చుక వూరల్లా తిరిగింది. చంద్రోదయం అయేప్పటకి రాజు దగ్గరకు వొచ్చి "నేను వెళ్తున్నాను. చెప్పిపోయేందుకు వొచ్చాను" అని అన్నది. "పిచ్చుకా! ఈ ఒక్కరాత్రి నాతోకూడా ఉండు" అని దీనంగా అడిగాడు రాజు.

"కాదు. మావాళ్లు నాకోసం ఎదురుచూస్తూం టారు. పాపం! ఒక రత్నం, ఒక నీలం పోగొట్టుకున్నావు. వచ్చే చలికాలం నే నెలాగో ఇటు వొస్తాను. అప్పుడు నీకు ఒక రత్నం, ఒక నీలం తెచ్చిపెడతాలే;... ఇప్పటికిమాత్రం సెలవు-" అంది పిచ్చుక.

"పిచ్చుకా! ఆ దూరాన ఒక చిన్న పిల్ల వుంది. ఆమె అగ్గిపెట్టెలు అమ్ముకొని జీవిస్తూవుంటుంది. కాలుజారి పడి, అగ్గి పెట్టెలన్నీ పక్కనే వున్న మురుక్కాలవలో పడేసుకుంది. డబ్బుల్లేకుండా ఇంటికి వెళ్తే వాళ్ల నాన్న తంతాడు. అందుకని ఏడుస్తూ కూర్చుంది. నా రెండోకంటిని తీసుకొనివెళ్ళి ఆమెకు ఇవ్వు" అన్నాడు రాజు.

"కావాలంటే యీరాత్రికూడా నీతోనే వుంటాను. కాని రెండోకన్నుకూడా తీసి వేయలేను. నీవు అసలే గుడ్డివాడివి అవు తావు" అన్నది పిచ్చుక.

"నాకేం విచారం లేదు. పిచ్చుకా! నేను చెప్పినట్లు చేయువమ్మా!' అన్నాడు రాజు, బతిమాలుతూ.

పిచ్చుక రాజు రెండో కంటిని పెరకక తప్పలేదు. ఆ నీలం ముక్కున కరచుకొని వెళ్ళి ఆ చిన్నపిల్ల చేతుల్లో పెట్టింది. "భలే

బాగుంది!" అని ఆనందంతో కళ్లనీళ్ళు కూడా తుడుచుకోకుండానే ఆపిల్ల ఇంటికి పరుగెత్తింది.

పిచ్చుక విచారంగా రాజువద్దకు వచ్చి "నేను ఎప్పుడూ నీతో నేవుంటాను; అంధుడివై నీవెలా జీవిస్తావు?" అన్నది.

"కాదు; మీవాళ్ళు నీకోసం ఎదురు చూస్తూంటారు. వెళ్ళు" అన్నాడు రాజు.

"వెళ్లను. ఇక్కడేవుంటాను" అని పిచ్చుక ఆ రాత్రికూడా రాజుగారి పాదాల వద్ద పడి నిద్రపోయింది.




మర్నాడు పిచ్చుక వూళ్ళోకి వెళ్లలేదు, రాజుగారి భుజంమీద కూర్చొని తాను తిరిగిన ప్రదేశాలలోని వింతలు చెప్ప సాగింది. ఎన్నో విచిత్రాలు విన్నాక రాజు అన్నాడు: "కాని వీటన్నిటికన్నా విచిత్రమైనది మానవునిబాధ. పిచ్చుకా! నేను పరిపాలించిన ఈ పట్టణమంతా తిరిగి ప్రజల బాధలు నాకు చెప్పుతూవుండు."

పిచ్చుక పట్టణమంతా తిరుగసాగింది. కలవారి ఇళ్లల్లో విందులు జరుగుతున్నవి; వారు తినగా పారేసిన ఎంగిలిమెతుకుల కోసం బీదలు వారి మేడలనీడల్లో కాచుకు కూర్చున్నారు. చిన్న చిన్న సందు గొందుల్లో ఆకలిబాధతో కృంగికృశించిన చిన్న పిల్లల జాలిగొలిపే స్థితి పిచ్చుక కంటపడింది.

పిచ్చుక యీ సంగతులన్నీ రాజుకు చెప్పింది.

"నా శరీరంనిండా బంగారుతొడుగులు ఉన్నవి. ఒక్కొక తొడుగే తీసి నా బీద ప్రజలకు పంచు. అందువల్ల వారు సుఖంగా ఉంటారు" అన్నాడు రాజు.

ఒక్కొక్క తొడుగే తీసి పిచ్చుక బీద వారికి ఇవ్వసాగింది. చివరకు రాజ విగ్రహంలో కంచు తప్ప మరేమీలేదు. కాని బీదపిల్లలు ఇప్పుడు సంతోషంగా, హాయిగా ఆడుకొంటున్నారు.

చలి తీవ్రమయింది. మంచు విపరీతంగా కురియసాగింది. పిచ్చుక చలికి తట్టుకోలేని స్థితికి వచ్చినా, రాజును విడిచిపెట్టలేదు. పాపం పిచ్చుక నానాటికి కృశించి మృత్యువుకు చేరువకాసాగింది. ఇక బతుకుతాననే ఆశ లేక, చివరిసారి రాజుదగ్గర సెలవుతీసుకునేందుకు వచ్చి "రాజా! నేను నీచేతిని ముద్దాడనా?" అని అడిగింది.

"చేయి కాదు. నాపెదవినే ముద్దాడు. మీదేశం వెళ్తున్నావుకదూ?" అన్నాడురాజు.

"లేదు. నేను ఇంకా దూర ప్రయాణమే చేయబోతున్నాను. ఇక తిరిగిరాను" అన్నది పిచ్చుక.

రాజు పెదవిని ముద్దాడిన పిచ్చుక చచ్చి పాదాలదగ్గర పడింది. ఇదేసమయంలో ఏదో బ్రహ్మాండం బ్రద్దలైనంత శబ్దం వినిపించింది. సీసంతో పోతపోసిన రాజహృదయం రెండుగా విచ్చింది.

మర్నాడు పట్టణంలోని పెద్దలు ఆ దారిన వస్తూ రాజుగారి విగ్రహాన్ని చూసి, "విగ్రహం అందంగా లేదు. ఇక్కడ ఉంటే పట్టణానికి అప్రతిష్ఠ" అని తీసేశారు.

దానిస్థానంలో ఎవరి విగ్రహం ఉంచాలనే మీమాంస బయలుదేరింది. పట్టణపు పెద్దలు నాదంటే నాదని పోట్లాడుకున్నారు. వారి పోట్లాట అప్పటికీ ఇప్పటికీ తెగలేదు.

పాత విగ్రహాన్ని కరగేశారు. ఎంత మంట పెట్టినా సీసపు గుండెమాత్రం కరగలేదు. చివరకు విసిగి దానిని బయట పారేశారు.

ఒకనాడు "ఆ పట్టణంలో రెండు అమూల్యమైన వస్తువుల్ని తీసుకొనిరండి" అన్నాడు దేవుడు. దేవదూతలు వూరంతా తిరిగి, చచ్చిన పిచ్చుకనూ, కరగని సీసపు గుండెనూ తీసుకెళ్ళారు. "సాటిలేని వస్తువులు!" అని దేవుడు మెచ్చుకున్నాడు.






# అన్నిటి కన్న మిన్న

గిరిదుర్గ రాజ్యానికి అధిపతి క్షేమేంద్రుడు. ఆయనకు నమ్మకమైన సేనాధిపతి ఉండేవాడు. ఐతే ఆ సేనాపతి 'రాజు ఎప్పుడు మరణిస్తాడా, ఎప్పుడు రాజ్యాధికారం చేజిక్కించుకుందామా' అని కనిపెట్టుకుని వున్నాడు. రాజు మరణించగా, కొద్దిరోజులలోనే రాజ్యం సేనాధిపతి వశమైంది. అలా వశంకాగానే అతను రాజవంశీయులపట్ల బహుక్రూరంగా మెలగజొచ్చాడు.

క్షేమేంద్రునికి నందుడు, సునందుడు, ఆనందుడు అని ముగ్గురు కొడుకులు. సేనాధిపతి పెట్టే యాతనలకు తట్టుకోలేక, వాళ్ళు ముగ్గురూ పారిపోయి ఒక యెడారి ప్రాంతం చేరుకున్నారు. ఆ సమీపంలోనే వారికి ఒక చక్కటి కుటీరం కనిపించింది.

అక్కడ ఒక వృద్ధుడూ, అతని కూతురూ కంటబడ్డారు. వారు, అలిసిపోయిన రాజకుమారులను లోపలకు తీసుకపోయి, ఆదరించారు. రాత్రికి తమ కుటీరంలోనే ఉండిపొమ్మని పట్టు పట్టారు కూడాను.

సోదరులు ముగ్గురూ ఆ రాత్రి ఒక ఏకాంతస్థలంలో కూర్చుని మళ్ళీ తమ రాజ్యం పొందటం ఎలాగా అని వారిలో వారు తర్కించుకోసాగారు. వారు చీకటిలో కూర్చోవటం చూచి, ఆ వృద్ధుని కూతురు ఇందుమతి ఒక దీపం తెచ్చి అక్కడ పెట్టింది. ఆమె కూడా దగ్గరనే కూర్చుండి వారి సంభాషణలు వింటున్నది.

అందరిలో పెద్దవాడైన నందుడు "ప్రపంచంలో మనిషికి కావలిసింది అధికారం. చేతులో అధికారం ఉండబట్టేకదా, సేనాధిపతి మనరాజ్యం కాజేయగలిగాడు!" అన్నాడు.

రెండవవాడైన సునందుడు "ధనముంటే దానితోపాటే అధికారమూ వస్తుంది. అధికారంకోసం ప్రయత్నమెందుకు?" అన్నాడు.

కె. సత్యవతి




కడసారివాడైన ఆనందుడు తన మనసులో వుద్దేశం ఏమీ చెప్పలేదు. ఇందుమతివైపే చూస్తూ కూర్చున్నాడు. అన్నలిద్దరూ 'నీవేమీ చెప్పవేమిరా తమ్ముడూ!' అన్నారు. అందుకు ఆనందుడు 'అదే ఆలోచిస్తున్నా'నని ఊరకొన్నాడు.

తెల్లవారింది. అన్నాదమ్ములు కుటీరం నుండి బయటకు వచ్చారు. ఎదుట ఎడారిలో బిడారి వర్తకుల గుంపు కనిపించింది.

నందుడు "నేను ఈశాన్యదిక్కుగా పోయి, సరీగా పదేళ్లకు పెద్ద సైన్యంతోసహా తిరిగివస్తాను. మనం మళ్ళీ యిక్కడే కలుసుకోవాలి" అని చెప్పి బయల్దేరాడు.

"నేను వాయవ్యదిశగా వెళ్ళి, పదేళ్ళకల్లా గొప్ప ఐశ్వర్యంతో తిరిగివస్తా"నని సునందు డన్నాడు.

ఇద్దరూ కడసారివానికేసి ప్రశ్నార్థకంగా చూచారు. ఆనందుడు "నేనీ సమస్య ఆలోచిస్తూనేవున్నాను. నేనూ పదేళ్ళకు మిమ్మల్ని ఈ కుటీరం దగ్గరే కలుసుకొంటాను" అని చెప్పాడు.

అన్నదమ్ములమధ్య జరిగిన ఈ సంభాషణంతా ముసిలివాడూ, కూతురూ వింటూనేవున్నారు. కాలచక్రం గిర్రున తిరిగి పోయింది.

* * *

పదేళ్ల తరువాత—

ఆ కుటీరం చుట్టూ వుండే పూల మొక్కలూ అవ్వీ పెరిగి పెద్దవై, పర్ణశాలలా చక్కటి శోభ కూరుస్తున్నవి. ఇందుమతి ఒక అందాల శిశువును చంకనెత్తుకొని, కుటీరంవాకిట నిలబడి ఎడారివైపే కలియ చూస్తూవున్నది.

ఆలా చూస్తూవుండగానే, ఒకవేపునుంచి అశ్విక దళం, మరొకవంక పదాతిదళం, బరువులతో ఒంటెలు, కంచరగాడిదలు రావటం కనిపించింది. కొంచెంసేపటిలోనే ఎడారి అంతా సైనికులతో నిండిపోయింది.

సైనికదళాలూ, జంతుసమూహాలూ బారులు తీర్చి నించున్నయి. ఒక అజానుబాహువు అజ్ఞలు ఇస్తూ వున్నాడు.

ఇంకొకపక్కనించి మరిఒక జంతువుల బారు రాసాగింది. ఈ జంతువుల వీపులపై నున్న సంచులు ధగధగ మెరిసే రత్నాలతో మణులతో నిండివున్నయి! మీసాలు మెలి పెట్టుకొంటున్న ఒక లంబోదరుడు వీటి కన్నిటికీ అధిపతిగా కనిపించాడు.

అజానుబాహువూ, లంబోదరుడూ ఒకరి నొకరు పలకరించుకొన్నారు. నందుడే ఆ అజానుబాహువు. సునందుడే లంబోదరుడు.

"ఇప్పుడు ప్రపంచంలో నేను ఏదైనా సాధించగలను. అందుకు అవసరమైన ధనం నాకు పుష్కలంగా లభించింది" అన్నాడు, సునందుడు. పెద్దవాడైన నందుడు తన సైన్యంవేపు వేలెట్టిచూపుతూ, "ఇది నాసైన్యం. నేను దీనికి అధిపతిని. ఈ సైనిక బలంతో నేను సాధించలేనిది లేదు" అన్నాడు అహంకారంతో.

"ఈ సైన్యాలకు అధికారినని గర్వపడుతున్నావు. నాధనంతో నీ సైన్యాన్నంతటినీ కొనివేస్తా, ఏమనుకున్నావో. ఇలానే మన గిరిదుర్గ రాజ్యాన్ని వశంచేసుకోగలను"



అన్నాడు, దర్పంగా నవ్వుతూ సునందుడు తన అన్నతో "సైన్యాధికారి అంటే ఏమను కొంటున్నావే! నేను అజ్ఞయిస్తే టమే తరువాయి, నిన్నూ నీ ధనాన్నీ నిమిషంలో కొల్లగొట్టగలరు నా సైనికులు" అన్నాడు నందుడు. సోదరులు ఇలా వాదించుకొనే టంతలో కడసారివాడు ఆనందుడు నవ్వుతూ వారివద్దకు వచ్చాడు. అతను చెరిపకచేతా ఇద్దరు బిడ్డలను వెంటబెట్టుకువచ్చాడు. అతని వెనక ఒడిబిడ్డను ఎత్తుకొని ఇందుమతికూడా వచ్చింది.

అన్నలిద్దరూ ఆశ్చర్యంతో చూచారు, తమ్ముణ్ణి. తమతమ ప్రభావాలను వెల్లడించారు. "ఈ పదేళ్లలో నీవేమిచేసినట్టు?" అని ప్రశ్నిస్తున్నట్టుగా వానివేపు చూచారు. "ఇదిగో, ఇదే" నన్నట్టుగా ఆనందుడు ఒక్క చూపుతో పిల్లలవైపు సంజ్ఞచేశాడు. అన్నలిద్దరూ మళ్ళీ కాట్లాడుకొనసాగారు. వారిలో ఘనకార్యాలు చేశామన్న అహంకారం ప్రబలజొచ్చింది.

అప్పుడు ఆనందుడు అన్నలను కుటీరం లోపలికి తీసుకుపోయి, సముదాయించి వారికి సదుపాయాలన్నీ అమర్చాడు. స్తిమిత పడిన తరువాత ఒక లేఖ తీసి చూపాడు. అది గిరిదుర్గ ప్రజలు పంపుకొన్న లేఖ.

"మనలను ద్రోహంచేసిన ఆ దుష్ట సేనాని చచ్చిపోయాడు. వచ్చి సింహాసనం అధిష్ఠించమని ప్రజలు వచ్చి నన్ను కోరారు. ఇలా తరుచు జాబులు వ్రాస్తూ వున్నారు. కాని, నేను మీకోసమే ఇక్కడ వేచిఉన్నాను. మన తండ్రిరాజ్యం జయించటానికి మీరింక శ్రమపడవలసిన పనిలేదు. ఇందుకోసం సేనలక్కరలేదు. ధనమూ అగత్యంలేదు" అని చెప్పాడు ఆనందుడు.

ఇంగితజ్ఞుడైన తమ్ముడు చేసిన పనికి అన్నలిద్దరూ ఆనందించారు.



# బుడగ ఎలా ఏర్పడుతుంది?



బుడగ చిన్నచిన్న నీటిచుక్కలతో ఏర్పడుతున్నది. ఈ నీటిచుక్కలు ఒక అద్భుతమైన శక్తివలన కలుసుకొని వుంటాయి. ఈ శక్తి ద్రవపదార్థాల అన్నిటి మట్టంమీదా పనిచేస్తుంది. దీని మహిమవల్ల నీటిచుక్కలు ఒకదాని కొకటి కలుసుకొని, విడిపోకుండా వుంటాయి. ఈ నీటిచుక్కల సమూహమే ఒక పొరలాగా యేర్పడుతుంది. అందుకనే, గ్లాసునిండా నీరున్నప్పుడు మట్టంమీద వున్న పొర నీటిని తొణికిపోనివ్వదు. అన్ని ద్రవపదార్థాల మీదా ఇటువంటి పొరలే వుంటాయి. కాని, బుడగ అంటే



అంతా పొరయేకదా, లోపల ఏమీ ఉండదుకదా! లోపల ఉండే గాలిఒత్తిడి వలన ఈ పొర సాగుతుంది. గాలిఒత్తిడి అన్నివైపులా వుండటంచేతా, జలకణాలు ఒకదాన్ని ఒకటి ఆకర్షించడంచేతా ఈ పొర 'బెలూన్' లాగా ఉబుకుతుంది.

కాని, ఈ బుడగలు ఎక్కువసేపు నిలిచివుండవు. ఏమంటే, ఏ జలకణాల కలయికవల్ల ఇది ఏర్పడుతున్నదో అవి 'భూమ్యాకర్షణకు' లోబడివుంటాయి. భూమ్యాకర్షణ వాటిని క్రిందికి లాగుతుంది. పైగా ఈ అకర్షణ పైన చెప్పిన అద్భుతశక్తికంటెకూడా బలవత్తరం కావటంవల్ల నీటిచుక్కలు కిందికి జారిపోయి, బుడగపొర పలుచబడిపోయి, లోపలవుండే గాలిఒత్తిడికి తట్టుకోలేక టపీమని పేలిపోతుంది.




పవనపుర ప్రభువైన అవనీంద్ర మహారాజు నిండుకొలువులో వుండగా, ఒకనాడు రాజభటులు బక్కచిక్కిన ఒకనిని పెడరెక్కలు విరిచితెచ్చి ఆయనముందు నిలబెట్టారు.

"ఎవడురా వీడు?" అని గద్దించి అడిగాడు రాజు.

"జిత్తులమారి జాలయ్య ప్రభూ! ఈనాటికి దొరికాడు" అని భటులు జవాబిచ్చారు.

"ఉరిశిక్ష విధించాము. చింతచెట్టు కొమ్మకు వేలాడతీయండి!" అని ఆజ్ఞాపించాడు రాజు.

"ప్రభూ, కరుణించాలి!" అన్నాడు దీనంగా జిత్తులమారి జాలయ్య.

"తమరు రాజులుగనక, ఖడ్గబలంవల్ల బ్రతుకుతున్నారు; నేను సామాన్యుణ్ణి గనక, యుక్తిబలంవల్ల జీవిస్తున్నాను. ఏదో విధంగా బ్రతకాలిగదా, ప్రభూ!" అంటూ జాలిగా వేడుకొన్నాడు జాలయ్య.

రాజు జాలయ్యతో "నా కత్తికి యీలోకంలో ఎదురంటూ లేదు. మరి, నీ యుక్తిబలానికికూడా ఎదురు లేదా?" అన్నాడు.

"లేదు ప్రభూ, లేదు!" అన్నాడు జిత్తులమారి జాలయ్య, కొంతసేపు ఆగి.

"ఓహో అలాగా! సరే, నీ బుద్ధిబలాన్ని పరీక్షించేందుకు మూడు పరీక్షలు పెట్టబోతున్నాను" అన్నాడు రాజు.

"బుద్ధిబలం కలవాడికి అసాధ్యమైన పని అనేదే లేదు ప్రభూ!" అన్నాడు జాలయ్య ముసిముసినవ్వులు నవ్వుతూ.

రాజు ఆజ్ఞప్రకారం జాలయ్యకు కట్లు విప్పేశారు భటులు. రాజు వాణ్ణి కోటబురుజు మీదకు తీసుకుపోయి, దూరాన పొలం దున్నుతున్న ఒక రైతును చూపించాడు.

"ఆ రైతుకు తెలియకుండా అతడి కాడిఎడ్లను కాజేయాలి. ఇదీ మొదటి పరీక్ష" అని చెప్పాడు.

చిట్టిబాబు

రాజువద్ద సెలవుతీసుకుని జిత్తులమారి జాలయ్య బయలుదేరాడు. పొలంపక్కనే వున్న అడవిలోపలకి చడీచప్పుడూ లేకుండా జొరబడ్డాడు. అక్కడనె దాక్కుని, గొంతెత్తి శ్రావ్యంగా పాడసాగాడు.

ఆ పాట చెవినిపడేసరికి పొలం దున్నుకొంటూవున్న రైతు దున్నటం ఆపి, అంత శ్రావ్యమైన పాట ఎక్కడినించి వస్తున్నదా అని నలుమూలలా చూడసాగాడు. ఎవరూ కనపడకపోయేసరికి ఎడ్లను వదిలేసి తన్మయత్వంతో అడవిలోకి జొరబడ్డాడు.




ఇందుకోసమే ఎదురుచూస్తున్న జిత్తులమారి జాలయ్య, అడవిలోనించి బయటపడి సరాసరి ఆ ఎడ్లదగ్గరకు వచ్చాడు. మొలలో నుంచి కత్తితీసి ఆ ఎడ్ల తోకలూ కొమ్ములూ కోసేశాడు. వాటిని అక్కడే భూమిలో కాస్త కాస్త బయటికి కనబడేట్టు పాతేసి, ఆ మొండి ఎడ్లను అడవిలోకి తరిమేశాడు.

ఇంతట్లో రైతు అడవిలోనించి ఇవతలకు వచ్చాడు. ఎంత వెతికినప్పటికీ, అడవిలో ఆ పాటపాడే మనిషి కనబడకపోయేసరికి, ఎవడో దారితప్పిన గంధర్వుడే ఆ గానం ఆలాపించివుంటాడనుకుని మనస్సు సరిపెట్టుకున్నాడు. ఇంతకంటె చేయగల దేముంది? సరాసరి తను దున్నుతూవున్న చేనుదగ్గిరకు వచ్చి చూస్తే ఎడ్లు లేవు. కాని, భూమిలోపలనించి కొంచెంకొంచెంగా ఎడ్ల కొమ్ములూ, తోకలూ కనబడుతున్నవి.

ఇంతలోకి జిత్తులమారి జాలయ్యకూడా అక్కడికే వచ్చాడు. ఏమీ తెలియనట్టు సంగతి ఏమిటని రైతును అడిగాడు. రైతు జరిగిందంతా చెప్పాడు. అందుకు జాలయ్య: "ఒకవేళ భూమిలోకి కూరుకుపోయినవేమో! తోకపట్టుకుని లాగరాదా?" అని సలహాయిచ్చాడు.

పాపం, ఆ రైతు బయటికి కనపడుతూన్న తోకలు, కొమ్ములూ పట్టుకుని గుంజేసరికి అవి కాస్తా చేతుల్లోకి ఊడివచ్చినై.



తన ఎడ్లజత, కిందవున్న ఏదో బురద గుంటలో దిగబడిపోయి వుంటుందనుకుని, దేవుడా అంటూ ఇంటికి మరలిపోయాడు.

కోటబురుజుమీద నించుని యిదంతా కనిపెడుతూన్న అవనీంద్రుడు, జాలయ్య బుద్ధిబలాన్ని మెచ్చుకొన్నాడు. కాసేపటికల్లా జాలయ్యా వచ్చాడు.

"జాలయ్యా, నీ బుద్ధిబలం గొప్పదే! రెండవపరీక్ష విను. ఈరాత్రికి మా గుర్రపుశాలలోపంచకల్యాణిని ఎవరికీతెలియకుండా తస్కరించాలి. తెలిసిందా!" అన్నాడు రాజు.

జాలయ్య రాజుకు నమస్కరించి వెళ్ళిపోయాడు. రాజు వెంటనే గుర్రపుశాలలో కాపలావాళ్ళను పిలిచి, 'యీ రాత్రికి చాలా జాగ్రత్తగా వుండాలి' అని హెచ్చరికచేశాడు.

జాలయ్య, సరాసరి రాజభవనానికి వెళ్ళి సేనానాయకుడి దుస్తులు దొంగిలించాడు. అవి తొడుక్కుని, నడిరేయికల్లా గుర్రపుశాలదగ్గరకు వచ్చి చూస్తే, రాజుగారి కావలివాళ్లంతా అతిజాగ్రత్తతో వున్నారు. ఒక అశ్వికుడు రాజుగారి పంచకల్యాణిమీదనే కూర్చునివున్నాడు.

పరిస్థితి తెలుసుకున్నాడు జాలయ్య. సరాసరి కాపలావాళ్ళదగ్గరకు వచ్చి—

"అబ్బాయిలూ!—దొంగ దొరికిపోయాడు. ఇంతరాత్రివరకూ మీరు మేలుకుని జాగ్రత్తగా వున్నందుకు రాజుగారు ఎంతో మెచ్చుకొన్నారు. మిమ్మల్ని సరదాగా ఉండమని ఈ పానీయం బహుమతిగా పంపించారు" అంటూ వెంటతెచ్చిన పర్బతుబుడ్లు తలకొకటీ వాళ్లముందు పెట్టాడు.

జాగారం తప్పించే చాలుననుకున్న భటులంతా ఆ పర్బతుబుడ్లను అందినవి అందినవెంటనే నోటికి తగిలించారు. అందులో ముందుగానే మత్తుమందు కలిపితెచ్చిన జిత్తులమారి జాలయ్య, వాళ్ళు తాగి కిందపడిపోగానె, రాజుగారి గుర్రాన్ని ఎక్కి బయటికి పుడాయించాడు.

కాసేపు ఐన తరువాత రాజుగారు అశ్వశాలకు వచ్చిచూస్తే, పడిపున్న కాపలావాళ్లు కనిపించారు. శాలలో గుర్రం లేదు.

అంతగా ముందుజాగ్రత్తలు తీసుకున్నా, ఇంతమోసం జరిగిందేమిటా అని అనుకొనేటంతలో, గుర్రంమీదినించి జాలయ్యా రాజుగారిఎదుట దిగాడు. రాజు తెల్లబోతూ—

“జాలయ్యా, ఇక ఆఖరుపరీక్ష చెబుతా విను: రాణిగారి వేలివుంగరాన్ని, ఆమె మేలుకొనివుండగా అపహరించగలిగితివంటే, నిన్ను క్షమిస్తాను” అన్నాడు.

ఈమాట చెప్పి రాజు సరాసరి అంతఃపురానికి వెళ్ళి రాణిపక్కనే కూర్చున్నాడు. పహరావాళ్లను హెచ్చరించే వుంచాడు.

గంటసేపయినతరవాత హఠాత్తుగా ఎవరో వస్తున్న అలికిడి ఐంది. పిట్టగోడదగ్గరకు వెళ్ళి రాజు కిందకు చూశాడు. పిట్టగోడ వరకు ఒకనిచ్చెన ఆనించివున్నది. ఆ నిచ్చెనమీదినించి ఎవరో మనిషి పైకి ఎక్కి రావడం కనిపించింది.

ఇంకేపని ? జిత్తులమారి జాలయ్యే ఐవుంటాడనుకొని ఆ చీకట్లో సరీగా గుర్తించకుండానే రాజు నిచ్చెన ఒకచేత పట్టుకుని ఆ మనిషిని రెండోచేతితో నెట్టేశాడు. అలా రాజు నెట్టివేసింది నిజమైన మనిషి




కాదు. జాలయ్యా, సరీగా తనవంటిదే ఒక గుడ్డబొమ్మ తయారుచేసి, నిచ్చెన మెట్ల మీదకు ఎక్కుతున్నట్టు బొమ్మను తాడుతో లాగుతున్నాడు. తను నిచ్చెనకు ఒకపక్కగా నించుని, యేంజరుగుతుందో అని వేడుక చూస్తూవున్నాడు.

మనిషిఅనుకున్న ఆ బొమ్మను కిందికి నెట్టివెయ్యగానే, రాజు మెట్లుదిగి వచ్చేశాడు. ఇది గమనిస్తునేవున్నాడు జాలయ్యా.

రాజు అటు వెళ్లగానే, జాలయ్యా మరొక వైపునించి మెట్లెక్కి రాణిగారి అంతఃపురం చేరుకుని, చాటున దాగి మారుగొంతుకతో ఇలా అన్నాడు:

"పాపం. అనుకున్నంతా అయింది. జిత్తులమారి జాలయ్యగాడు నిచ్చెనమీది నించి పడి చచ్చాడు. ఇక నీ వుంగరానికి ప్రమాదం ఏమీలేదు. ఐనా, కొన్నాళ్లవరకూ వుంగరంపెట్టుకు నిద్రపోవడం మంచిది కాదు. ఇటుతే, దాచేస్తా" అన్నాడు.

నిద్రమత్తులో వున్న రాణి, ఈమాట వినగానే తన వేలివుంగరాన్ని తీసి తెరపక్కనవున్న జాలయ్యచేతికి యిచ్చేసింది. ఆ వుంగరం చేతపుచ్చుకుని జాలయ్య పరుగుతీశాడు.

కాసేపటికల్లా రాజువచ్చి, నిద్రలో వున్న రాణిని లేపి, "పాపం, అనుకున్నంతా అయింది..." అని ఏమో చెప్పబోయేసరికి, రాణి కళ్ళు తెరిచింది.

"అస్తమానం అదేమాటా! యిప్పుడే కదూ నావేలివుంగరం తీసి పట్టుకెళ్లారూ?" అన్నది ఆమె విసుగ్గా.

"ఇదేమిటి? వుంగరమా!! వుంగరం!" అన్నాడు రాజు తెల్లబోతూ. వెంటనే జిత్తులమారి జాలయ్య ఎత్తు తెలిసిపోయింది రాజుకు.

తెల్లవారగానే జిత్తులమారిజాలయ్య రాణీగారి వుంగరంతోసహా, రాజుగారి దగ్గరకు వచ్చాడు. రాజు నవ్వుతూ—

"జాలయ్యా! నీ బుద్ధిబలం సాటిలేనిదని తేలిపోయింది. నీ వురిశిక్ష రద్దు చేస్తున్నాను. 'జిత్తులమాన్యం' అన్నపేరుతో నీకు వందఎకరాల పొలం యిచ్చాను. హాయిగా బ్రతుకు, ఫో!" అన్నాడు.

"ప్రభువుల దయ..." అంటూ చేతులు జోడించి రాజుకు నమస్కరించాడు జిత్తులమారి జాలయ్య.

జాలయ్య తన యుక్తివల్ల సంపాదించుకొన్న 'జిత్తులమాన్యం' ఈనాటికీ అనుభవిస్తూ సుఖంగా వుంటున్నాడు.



# ఎంత వడిగా నడవగలవు?

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే ఒక సులువైన మార్గమున్నది :

ఎనభై లేక వందగజాల పొడవుగల సన్నటి దారం తీసుకో. ఒక సీసం ముక్క గాని, బరువైన లోహపు ముక్కగాని, లేదా రాయైనా సరే తెచ్చి, ఆ దారానికి ఒక చివరని కట్టు.

అలా కట్టిన బరువుకు 44 అడుగుల దూరంలో ఆనవాలుకోసం ఒక ముడి వెయ్యి. లేదా, మడత ఒకటి పెట్టినాసరే. అక్కనుండి మళ్లీ 44 అడుగుల దూరంలో పైమోస్తరుగానే మళ్లీ ఒక ఆనవాలుపెట్టి, అలానే దారంపొడుగునా ప్రతి నలభైనాలుగేసి అడుగులదూరంలోనూ ఒక్కొక ఆనవాలు పెట్టుకొంటూ వెళ్లు. అనగా, మొత్తం వందగజాల పొడుగుగల దారానికీ, ప్రతి నలభైనాలుగేసి అడుగుల దూరంలోనా ఒక్కొక్క అనువాలు ఏర్పడి వుంటున్నది.

ఆటుతరువాత—సెకన్లుముళ్లు గల వాచీ చేతపట్టుకో. ఇప్పుడు, మొదట బరువు కట్టిన దారపు కొసని కిందపెట్టి, దారం చేతిలోనే పట్టుకొని మామూలుగా నడువు.

నీచేతిలోనుండి దారపుముళ్లు (ఆనవాళ్లు) ఒక్క అరనిమిషంలో యెన్ని జారి పడతాయో అన్ని మైళ్లు నీవు ఒకగంటలో నడిచినట్టు అన్నమాట.

ఎలాఅంటే—

ఒక మైలుకు 5280 అడుగులు. ఈ సంఖ్యను 44 పెట్టి భాగిస్తే 120 వస్తుంది. అనగా 5280 (లేక ఒక మైలు) లో 44 నూటయిరవైయ్యో భాగమని తేలుతూవుంది.

అలానే, ఒక గంటకు నిమిషాలు 60. లేదా అరనిమిషాలు 120. ఒక గంటకాలంలో అరనిమిషం 120 వ భాగం. దీన్నిబట్టి తెలుస్తూన్నదేమిటంటే : ఒక గంటలోని 120-వవంతు కాలంలో ఒక మైలులోని 120-వ వంతు దూరం నడవ గలుగుతున్నా వన్న మాటకదా !







# వితండుడు

ఒకానొకప్పుడు ఒక అరణ్యంలో వితండు డనే పేదవాడు ఉండేవాడు. వితండుడు అమాయకుడు. అతను తన రెక్కలకష్టం మీదనే గంపెడు సంసారాన్ని ఈదుకు రావలసి ఉండేది.

చీకటితోనే లేచి, గొడ్డలి బుజాన వేసికొని పోయి, అడవిలో కట్టెలు కొట్టితేవడం, ఆ తెచ్చినమోపు ఊరిలో అమ్ముకొని కాలక్షేపం చేయటం—ఇదీ అతని నిత్యకృత్యం.

ఇలానే ఒకనాడు వితండుడు కట్టెలు కొడుతూవుండగా, ఆ దారినపోయే ఒక సాధువు వానిని చూచాడు. కష్టజీవి ఐన వితండుణ్ణి చూడగానే ఆ సాధువుకు కనికరం వేసింది. వితండుణ్ణి పిలిచి, "నాయనా!-నీ వెవరవు? నీ పేరేమిటి?" అని అడిగాడు. అందుకు వాడు "అయ్యా!—నా పేరు వితండుడు. కట్టెలు కొట్టి జీవించటమే నా వృత్తి" అని చెప్పాడు.

సాధువు నవ్వుతూ, "వితండుడా! వితండుడు!—భేష్! బాగుంది పేరు." అని, కొంచెంసేపు ఆలోచించాడు.

కుశలప్రశ్న అయిన తరువాత "నాయనా!—లోకమే మరచి, సంసారం కోసమని ఇంత తాపత్రయపడుతున్నావే, నీ మనస్సులో ఎన్నడైనా దేవునిగురించి ఆలోచిస్తూఉంటావా?" అని ప్రశ్నించాడు.

"దేవుడా! ఎవరాయన? నే నెరిగిన బంధువులలోగాని, స్నేహితులలోగాని ఈ పేరుగలవాళ్లు లేరే! ఐనా, గంపెడు సంసారంతో సతమతమయ్యే నాకు, వాళ్ళను గురించీ, వీళ్ళనుగురించీ ఆలోచించే తీరిక యెక్కడ స్వామీ?" అని బదులు చెప్పాడు.

ఈ జవాబు వినేసరికి వితండునిమీద సాధువుకు ఆశ్చర్యమూ వేసింది, కోపమూ వచ్చింది. ఐనా తటపటాయించి, "అబ్బాయీ!—నీవు దేవుడిపేరే వినలేదా?

సి. రామకృష్ణ

వింతగావున్నదే!—నిన్నూ నన్నూ, ఈ చెట్లూ గట్లూ పుట్టల్నీ, ఆ దూరాన కనబడే కొండలనూ సముద్రాలనూ—మన కంటికి కనిపించే సమస్తమైన వస్తుజాలాన్నీ సృష్టించిన ఆ మహానుభావుని పేరే వినలేదా?—హహ్హహ్హహ్హ!!" అంటూ పకపక నవ్వాడు.

ఇలా మాటాడి, సాధువు నవ్వేసరికి వితండుడికి తనేదో గొప్పనేరం చేసినట్టు అనిపించింది. కాళ్ళమీదపడి, తరణోపాయం సెలవీయమని ప్రాధేయపడ్డాడు.

అప్పుడు సాధువు వితండుణ్ణి లేవదీసి, "నాయనా!—మానవజన్మ ఎత్తినందుకు మోక్షంపొందటమే సార్థకం, మోక్షంపొందాలంటే తపస్సుచేయాలి. అలా చేయకపోతే మనం మరణించినతరవాత మళ్లీ ఏ కుక్కగానో, కాకిగానో పుట్టవలసివస్తుందినుమా!" అని అనేకవిధాల బోధచేశాడు.

వితండుడు కళవెళపడ్డాడు. ఈ దేవుడి గొడవ జొరబడి అతని హృదయంలో నానా చికాకూ కలగసాగింది. సాధువు ముమ్మారు దీవించి తనదారిన వెళ్ళిపోయాడు. వితండుడు కట్టెలమోపు నెత్తినపెట్టుకుని బరువెక్కిన హృదయంతో, కాళ్లీడ్చుకుంటూ గ్రామానికి బయలుదేరాడు.




ఆరోజున కట్టెలు అమ్మగా వచ్చిన డబ్బులు భార్యచేతిలో పెట్టి, వితండుడు దైవధ్యానంలో మునిగిపోయాడు. భర్తలో వచ్చిన యీ మార్పుచూచి వితండుడిభార్య మొదట్లో ఆశ్చర్యపడింది. కాని మరునాటి వుదయం అడవికి పోకుండా దైవప్రార్థనలోనే మునిగివున్న అతణ్ణి చూసేసరికి విపరీతమైన కోపం వచ్చిందామెకు.

"వేళయింది, గొడ్డలి బుజానవేసుకుని అడవికి పోవేం!" అన్నది ఆమె.

"ఊహుఁ! పోను. నా ఆత్మగతి యేం కావాలి? నేను అడవికి పోతే దేవుడి సంగతేమిటి?" అని గద్దిస్తూ, అర్థం అయ్యీ




కాని సాధువు మాటలను ఏకరువుపెట్టాడు. అతనిభార్య అప్పటికి పూరుకుంది. ఒకటి రెండురోజులు గడిచాయి. కాని వితండుడు కాలమంతా దైవప్రార్థనలోనే గడపసాగాడు. ఇంట్లో చిట్టెడు గింజలుకూడా లేవు. పిల్లలు ఆకలితో అలమటించిపోతున్నారు. భర్త ధోరణి యిక ఏమాత్రం సహించలేక, వితండుడి భార్య తిట్లపారాయణ ప్రారంభించింది. 'ఛీ' అనుకొన్నాడు వితండుడు. 'దైవప్రార్థనకైనా అవకాశంలేని ఈ పాడు కొంపలో ఉండటం ఎందుకు?' అని ప్రశ్నించుకున్నాడు. విరక్తిచెంది, సరాసరి కొండలకేసి బయలుదేరాడు.



అక్కడికి దగ్గరలోనే 'మంత్రపర్వతాలు' అనే పెద్ద కొండలపరస వున్నది. రాత్రిళ్ళే కాదు, పట్టపగలు సయితం ఆ కొండల మీదికి ఎవరూ వెళ్లరు. అక్కడ పిశాచాలో, గంధర్వులో మసలుతూవున్నట్టు లోకులు చెప్పుకొనేవారు.

దైవప్రార్థనలో మైమరచి వున్న వితండుడు సరాసరి ఆ మంత్రపర్వతాల మీదికే వెళ్ళిపోగలిగాడు. దట్టంగా వున్న చెట్లమీద, చిక్కగా అల్లుకుపోయిన కొండ తీగెలతో, చల్లగా చీకటిగా వున్న ఒక ప్రదేశంలో కూర్చున్నాడు. మరి కాస్సేపటికల్లా దైవప్రార్థనలో నిమగ్నుడైయ్యాడు.

అలా ఎంతకాలం గడిచిపోయిందో చెప్పలేము. ఒకనాడు, దైవప్రార్థనలో నిశ్చలంగా కూర్చునివున్న వితండుడికి దగ్గరలోనే ఏదో శబ్దం వినిపించినట్టయింది. అడ్డంగా వున్న చెట్లకొమ్మల్ని అవతలకు తొలగించిచూశాడు.

ధగధగమనే వస్త్రాభరణాలతో, నిగనిగమనే శరీరకాంతితో, మిరుమిట్లుకొల్పుతున్న యిద్దరు కన్యలు—అక్కడ పచ్చికమీద కూర్చుని పచ్చీసు ఆడుకుంటున్నారు. చూస్తున్నాడు వితండుడు.








సర్వం మరచి పచ్చీసు ఆడుకుంటున్న ఆ కన్యలు ఎవరో! వితండుడికి ఈ సందేహమే కలగలేదు. వారి పచ్చీసు ఆటలో తనూ భాగస్వామి అయిపోయాడు!

ఆట మంచి పసందుగా సాగిపోతూ వుంది. గడులలోనుంచి పైకీ కిందికీ, ప్రక్కలకీ కన్యలిద్దరూ కదిలిస్తున్న ప్రతి గవ్వకేసీ గుచ్చిగుచ్చి చూస్తున్నాడు వితండుడు. హఠాత్తుగా ఒకామె పొరపాటుగా గవ్వను పైకి కదిలించబోయింది. ఆ ఎత్తుగడ తప్పు అని వితండుడికి తెలుసు.

"అమ్మాయ్, ఆ ఎత్తుగడ తప్పు! ఆ గవ్వను కదిలించకు" అనేశాడు అప్రయత్నంగా వితండుడు.

కన్యలిద్దరూ భయకంపితలై, వితండుడికేసి చూశారు. మరుక్షణానే లేళ్లుగా మారి, చెంగున ఎగురుతూ పారిపోయారు.

ఆ దృశ్యం చూసేసరికి వితండుడికి కలలోనుంచి మేల్కొన్నట్టనిపించింది. కొంపా గోడూ, పెళ్లాం బిడలూ అంతా గుర్తుకొచ్చి ఒక్కసారి చూసివద్దాం అనుకుని బయలుదేరాడు.

కాసేపటికల్లా కొండదిగువకు వచ్చేశాడు. దాహమైంది. అక్కడ చిన్న కొలనుదగ్గిరకు వెళ్ళి దాహం తీర్చుకునేందుకు నీళ్లకోసం కిందికి వంగేసరికి, నీటిలో ఒక వృద్ధుని స్వరూపం కనిపించింది!! వితండుడికి భయం పుట్టింది.

'అంతా మాయ! అసలీ పర్వతాలే మాయ!' అనుకొన్నాడు వితండుడు. అతను దాహంతీర్చుకుని తన ఇల్లు వుండే చోటికి వచ్చాడు. కాని అక్కడ తన ఇంటి ఆనవాలే కనబడలేదు. సంసారం ఏమైందా అని ఆలోచనలో పడ్డాడు వితండుడు. అంతలో నీలాటిరేవునుండి కడవ బుజానవేసుకుని పోతున్న ఒక స్త్రీ అతడికి ఎదురువచ్చింది. "అమ్మా! యిక్కడ వితండుడు అనే

ఒక కట్టెలవాడి భార్యా, బిడ్డలూ ఉండే వారుకదా. ఆ సంగతి నీకేమైనా తెలుసా?'' అని అడిగాడు.

ఆ స్త్రీ వితండుడికేసి అతి ఆశ్చర్యంగా చూసింది. తరవాత పకపక నవ్వుతూ—

"నాయనా!—ఈ ప్రాంతంలో మూడు తరాలక్రిందట వితండుడనే కట్టెలవాడు భార్యాపిల్లలతో ఉండేవాడనీ, సంసారమందు విరక్తికలిగి మంత్రపర్వతాలమీదికి పోయాడనీ, మా ముత్తవ చెబుతూవుండేది. అంతకన్న నాకేమీ తెలియదు" అన్నది.

ఆమాటలతో వితండుడికి అంతా అర్థమై పోయింది. ఒకసారి శరీరంకేసి చూసుకున్నాడు. ముడతలు పడివుంది. మోకాళ్ళవరకు తగులుతూంది తెల్లటిగడ్డం. ఆనాడు కొలనులో కనబడిన ఆ వృద్ధుని ప్రతిబింబానికి తన స్వరూపానికీ తేడా యేమీలేదు! శరీరంలో పటుత్వం సడలింది. ఆయాసపడుతూ, ఒక చెట్టుమొదట కూలబడ్డాడు. అతనికేసి జాలిగా చూసిన ఆ స్త్రీ అక్కడి నుంచి వెళ్ళిపోబోతున్నది. ఆగమని సంజ్ఞ చేశాడు వితండుడు. ఆమె ఆగింది. అప్పుడతను "నా మాట ఒక్కటి వుంది. ఈ మాటను మీ గ్రామంలోనే కాదు, వీలైనచోటల్లా వ్యాప్తిచేయాలి" అన్నాడు.

"ఏమిటది?" అని అడిగింది ఆ స్త్రీ, వింతగా చూస్తూ.

అందుకు వితండుడు "దైవప్రార్థనలో మునిగి భార్యాబిడ్డల్నీ, సంసారాన్నీ మరచి పోకూడదు. ఇది మహాపాపం! ఇలాంటి వాళ్లు రాబోయే జన్మలో కుక్కలుగానో, కాకులుగానో పుట్టితీరుతారు. ఇదే నా మాట!" అని చెప్పి ఆ చెట్టుమొదటనే ప్రాణం విడిచాడు. కాసేపటికల్లా గ్రామ ప్రజలు తండోపతండాలుగా వచ్చి, వితండుడి వింతచరిత్ర అంతా తెలుసుకోసాగారు.



## బదులు చెప్పు

1. ప్రపంచంలో పెద్దరత్నం ఏది ?
   - కలినాన్
   - కోహినూర్
   - నిజాం
2. ఇండియాలోకల్లా పెద్ద సింహద్వారం ఎక్కడ వుంది ?
   - ఢిల్లీ
   - ఆగ్రా
   - ఫతేపూర్ సిక్రి
3. అన్నిటికంటె గొప్ప మ్యూజియమ్ ఎక్కడవున్నది ?
   - మాస్కో
   - లండన్
   - న్యూయార్క్
4. 'కాదంబరి' వ్రాసింది ఎవరు ?
   - బాణుడు
   - భారవి
   - కాళిదాసు
5. అన్నిటికన్న ఎత్తున వున్న పట్టణం ఎక్కడ వున్నది ?
   - చైనా
   - అమెరికా
   - టిబెట్
6. టెలివిజన్ కనిపెట్టింది ఎవరు ?
   - అడిసన్
   - బేర్డ్
   - బన్సెన్

—[58-వ పేజి చూడు]

## వినోదం

ఒక ఉపాధ్యాయురాలు పిల్లవాని వ్యాసం చూడగా దానినిండా పెద్ద పెద్ద శబ్దాలున్నవి. ఆవిడ అతనిని పిలిచి, 'ఏమబ్బాయీ! ఈ వ్యాసం నీ సొంతమేనా?' అని అడిగింది. అందుకు ఆ పిల్లవాడు కొంతసేపు ఆలోచించి 'అలా అనటానికి వీల్లేదండి! ఇందులోని కొన్ని శబ్దాలు మీకు నిఘంటువులోకూడా దొరుకుతాయి' అని జవాబిచ్చాడు.

* * *

ఒక పిల్లవాడు మరీ విసిగించేటప్పటికి పంతులుగారు 'నేనే లేకపోతే, ఈ పట్టణంలోని చదువురాని గాడిదల్లో నిన్నుమించినవాడు ఉండడు' అన్నారు.

* * *

'డాక్టరుగారూ! నాకు నయమవుతుందా?' అని అడిగాడు రోగి.

'నూటికి నూరుపాళ్ళు నయంకావచ్చు. ఈ రోగంవల్ల నూటికి తొంభైమంది చచ్చిపోతారని పుస్తకములో వ్రాసివుంది. నా రోగులు తొమ్మండుగురు చనిపోయారు. నీవు పదవవాడివి. కాబట్టి తప్పకుండా నయమవుతుంది' అన్నాడు ఆ డాక్టరు.

* * *

చిట్టి తన స్నేహితురాళ్ళిద్దరి ముగ్గురితో ఆడుకొంటున్నది. ఇంతలో చిన్నికూడా ఆడుకోటాని కొచ్చింది. ఇది చిట్టికి ఇష్టంలేదు. అందుకని 'చిన్నీ! నీవు దాసీదానివి. నీ కివ్వాళ సెలవు. నీ వింటికి పోవచ్చు' అన్నది.

# దేవతల దీపాలు

చిక్కని చీకటిలో అప్సరసలు
సభతీర్చిన వేళలయందు,
దీపాలై వెలుగుతవి మిణుగురులు
ఏం చక్కా వారల ముందు?

మంచుతడులు అరని పచ్చికపై
మిణుకు మిణుకుమని మిణుగురులు.
రేతిరి కన్నియ చీరచెరుగుపై
మిలమిలమని ముత్తెపు సరులు.

నల్లని మొఖంమల్లు చీకటిపై
మెరుస్తున్న మిణుగురుపురుగులు,
తారకహీరక కాంతి కణాలై
ఎగిరే రవ్వల చిరు పరుగులు.

మిణుగురులున్నచోట పాపల్లూ!
అతిజాగ్రతగా మెలగండీ!
దగ్గరలోనే దేవతలెటనో
నర్తిస్తూ ఉందురుసుండీ!

---



పాపాయిలూ! ఈ కుక్కను చూడండి. ఎవరి కోసమో వెతుకుతున్నట్టు ఉంది గదూ! నిజమే. అక్కడే బుట్ట ఒకటి ఉంది చూశారా! ఆ బుట్ట యజమాని ఏమయ్యాడో తెలియటంలేదు. బుట్టలో తినుబండారాలున్నయ్. కుక్క నోరూరుతున్నది. కాని యజమాని వస్తాడేమోనని భయపడుతున్నది. యజమాని ఎక్కడున్నాడో చెప్పి కుక్కకు హెచ్చరికచేస్తారా!

# అట్టచివరిబొమ్మ

అద్భుతమైన ఈ కథ వినటంతోనే, ఇన్నాళ్లుగా తనను అదరిస్తున్న ఆ తెల్ల పిల్లే ఇప్పుడు ఎదట ప్రత్యక్షమైన ఈ భువనైకసుందరి అని తేలింది. ఇదిచూచి కృపాసేనుని ఆనందానికి మేరలేకపోయింది. తన తండ్రి కోరినటువంటి మూడవ కోరిక ఇంతటితో తీరినట్టే అతను ఉప్పొంగిపోయాడు.

కృపాసేనుడూ రత్నమాలా కలిసి భవనంలోని తక్కిన గదులలోకి వెళ్ళారు. శాపం తీరిన ఆమె పరివారం రత్నమాలను ఎదుర్కొనవచ్చారు. మళ్ళీ యిప్పుడు తమ రాకొమారి నిజస్వరూపంలో కనబడటం వారికి చెప్పలేని ఆనందాన్ని కలిగించింది. పైగా, ఆమె కృపాసేనుణ్ణి వలచినదన్న సంగతి తెలియగానే, మిన్నుముట్టేటట్టు అందరూ జయజయధ్వనులు చేశారు.

చిలకా గోరింకలలాగా కనిపించే ఆ ఉభయులూ, పరివారంతోసహా బయల్దేరారు. వారు సరాసరి కృపాసేనుని తండ్రిరాజ్యం చేరుకొన్నారు. అన్నలైన కాంతిసేనుడూ కమలసేనుడూకూడా చెరివక సుందరినీ తమతో వెంటబెట్టుక వచ్చారు. ఐతే, రత్నమాల సౌందర్యంముందు వారి అందచందాలు ఎంత మాత్రమూ వన్నెకెక్కేటట్టు కనిపించలేదు.

రత్నమాలను మించిన సౌందర్యవతి ముల్లోకాలలోనూ లేనేలేదని రాజ్యంలో అందరూ ఒక్కమాటగా చెప్పసాగారు. ప్రజల వుద్దేశం ఇలా వుండగా రాజు మరేమనటానికీ వీలులేకపోయింది. రత్నమాల సౌందర్యానికి సాటిలేదని రాజూ వప్పుకొన్నాడు. కడసారివాడైన కృపాసేనుని తెలివితేటలకు, పట్టుదలకూ మెచ్చుకొన్నాడు రాజు. వారిద్దరికీ అతివైభవంగా వివాహంచేసి, తన రాజ్యమిచ్చి కృపాసేనునికి పట్టంకట్టబోయాడు.

ఐతే, రత్నమాల చూపులకు మాత్రమే కాదు, సుగుణాలకుకూడ ఆమె సుందరే. ఆమె కోరికపైన పెద్దన్న లిద్దరకూ వారువారు తెచ్చుకొన్న రాజకుమార్తెలతో వివాహంచేయటానికీ, తండ్రి రాజ్యం ఒక్క కృపాసేనునికే గాక సోదరులు ముగ్గురకూ సరిసమంగా పంచిపెట్టటానికీ ఏర్పాట్లు జరిగినై.

ముగ్గురకూ ఒకేరోజున వివాహమైంది. నాటినుంచీ వారు ముగ్గురూ సుఖంగా రాజ్యం ఏలుకోసాగారు.

## టైప్‌రైటింగ్ చిత్రము



(ఎస్. వెంకటేశమూర్తి - హసాన్)

## రేఖా చిత్రము



ఉదయశంకర్ - ప్రయాగ్ (వయసు : 11 సం)

## ఫోటో వ్యాఖ్యల పోటీ

జూలై నెల ఫలితాలు

★

జూలై నెల చందమామలో ప్రచురింపబడె ఫోటోలకుగాను, మాకు వచ్చిన వ్యాఖ్యలలో ఉత్తమంగా వున్న ఈ దిగువ వ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

వ్యాఖ్యలు :

మొదటి ఫోటో : 'బెస్టు'

రెండవ ఫోటో : 'రెస్టు'

పంపిన వారు :

భూతపురి పాండురంగ విఠల్ కుమార్ వాల్తేరు.

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపిన వారి పేరుతోసహా జూలైనెల చందమామ ఫోటోల దిగువని ప్రచురిస్తాము. బహుమతి మొత్తం రూ. 10/-జూలై సంచిక వెలువడిన వెంటనే పంపబడుతుంది.

★

## ఆగస్టు నెలలో

ప్రచురింపబడే ఫోటోల నమూనాలు వివరాలతోసహా ప్రక్క పేజీలో చూడండి.

---

బదులుచెప్పు జవాబులు :

1. కలినాన్
2. ఫతేపూర్ సిక్రి
3. లండన్
4. బాణుడు
5. టిబెట్
6. జేర్డ్

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1953 ఆగస్టునెల సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పైరెండు ఫోటోలకూ సరిఐన వ్యాఖ్యలు కావాలి. వ్యాఖ్య ముచ్చటైన ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ ఉండవచ్చు. మొదటిఫోటోకూ రెండవ ఫోటోకూ వ్యాఖ్యలు సంబంధం కలిగివుండాలి.

★ జూన్ 10వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ దిగువ కూపన్‌లో వ్యాఖ్యలు రెండూ పూర్తి చేసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటోవ్యాఖ్యలపోటీ, మద్రాసు - 26.

★ చందమామ కూపన్లలో గాక, ఇతర విధముల పంపే వ్యాఖ్యలు పోటీకి పనికిరావు.

→ చందమామ ఫోటోవ్యాఖ్యల పోటీ కూపన్ ←

మొదటి ఫోటో
వ్యాఖ్య ........................................

రెండవ ఫోటో
వ్యాఖ్య ........................................

పంపినవారి పేరు ........................................

పూర్తి చిరునామా........................................

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him from Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI CHAKRAPANI.

Photo by D. I. Chanthamian



బహుమతి
పొందిన వ్యాఖ్య

మానుల జంట

పంపినవారు :
డి. అజంతాదేవి - చిత్తూరు

CHANDAMAMA (Telugu) JUNE 1953 Regd No. M. 4854




రంగులబొమ్మ కథ — 6 ..వ బొమ్మ